## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001354

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంఘ గంగోత్రి

# డా॥ హెడ్గేవార్

రచయిత

చంద్రశేఖర పరమానంద భిశీకర్

నవభారతి ప్రచురణలు

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాద్ - 500 029

# ప్రస్తావన

1925 లో ప్రారంభమైన రాష్ట్రీయ స్వయంసేవక సంఘం గత 63 సంవత్సరాలలో దేశమంతటా వ్యాపించింది. భారత జాతీయ జీవనంలో ఒక ప్రముఖ స్థానాన్ని ఏర్పరచుకోగలిగింది. దేశం ఎదుర్కొంటున్న సమస్యలవట్ల జాతీయ దృక్పథంతో ఆలోచన చేసే సంస్థ కనుక సంఘం ఆలోచనలకు జన సామాన్యంలో ప్రాముఖ్యత ఏర్పడింది. సంఘం గురించి ఈనాడు అందరికీ తెలుసు. అయినా సంఘ స్థాపకులైన డాక్టర్ కేశవ బలీరామ్ హెడ్గేవార్ పేరు గాని, వారి జీవిత చరిత్రగాని సంఘంతో పరిచయం లేని వ్యక్తులకు చాల కొద్దిగా మాత్రమే తెలుసు. తనకు వ్యక్తిగతంగా పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనే కోరికలేని డాక్టర్‌జీ స్వభావమే దీనికి ముఖ్యకారణం. 1988-89 డాక్టర్ హెడ్గేవార్ శతజయంతి సంవత్సరం. వారి శతజయంతి ఉత్సవాలు జరపడానికై డాక్టర్ హెడ్గేవార్ శతజయంతి ఉత్సవ సమితి ఏర్పడింది. డాక్టర్‌జీ జీవితచరిత్రను, ఆలోచనా సరళిని, వారు సాధించిన కార్యాలను జనసామాన్యానికి అందించాలనే ఉద్దేశ్యంతో బృహత్తరమైన జనసంపర్క ఉద్యమాన్ని చేపట్టింది. ఇందుకై సంఘస్వయంసేవకులూ, సంఘాన్ని ప్రేమించే పెద్దలూ గ్రామ గ్రామాలలో పర్యటించాలని నిర్ణయించుకున్నారు. ఈ సందర్భంలో డాక్టర్‌జీ జీవిత చరిత్రను ప్రచురించాలను కున్నాము. డాక్టర్‌జీ వ్యక్తిత్వంలో బీజరూపంలో రూపుదిద్దుకొన్న గుణాలు, సామాజిక రంగంలో వారు సాగించిన కృషి, సంఘమనే విశాల వటవృక్షంలోని శాఖోపశాఖలలో ఈనాడు ప్రకటిత మౌతున్నాయి. వాటిని సంక్షిప్తంగా దేశప్రజలందరకూ అందించే ప్రయత్నం ఈ చిన్న పుస్తకం ద్వారా జరిగింది. ఈ జాతి సర్వాంగీణ వికాసాన్ని సాధించటానికి కంకణం కట్టుకొన్న సంస్థగా రాష్ట్రీయ స్వయంసేవక సంఘం గురించి జనసామాన్యంలో ఈ పుస్తకం అవగాహన పెంచగలిగితే మా ప్రయత్నం సఫలమైనట్లే భావిస్తాం.

శ్రీ చం.వ. భిశీకర్ రచించిన ఈ పుస్తకాన్ని తెలుగులోకి అందంగా అనువదించిన శ్రీ పులుసు గోపిరెడ్డి, శ్రీ కందర్ప రామచంద్ర రావులకూ, ముచ్చటగా ముద్రించిన భారతీ ఆర్ట్ ప్రింటర్స్ హైదరాబాదు వారికీ మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

# 1

## ముళ్ళమధ్య పరిమళించిన పువ్వు

డాక్టర్ కేశవరావు హెడ్గేవార్ కలియుగాబ్ది 4661వ సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమి రోజున (1 ఏప్రిల్ 1889) నాగపూర్‌లోని ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు. వారి జీవితం వడ్డించిన విస్తరి కాదు. నాగపూర్‌లోని ఒక పురాతనవాడలో నివాసం. ఆధునిక విద్యకు ఎంతో దూరంగా ఉన్న కుటుంబం. సామాజిక జీవనానికి సంబంధించిన అవగాహన ఏమాత్రం లేనటువంటి కుటుంబ వాతావరణం - ఇదీ ఇంట్లో పరిస్థితి.

అయితే డాక్టర్‌జీకి భగవంతుడు ప్రసాదించిన ఒక అద్భుత వరమే కావచ్చు - కర్తవ్య పరాయణులై పరిస్థితుల ప్రభావాన్ని మార్చివేయగల ఆదర్శ జీవనాన్ని వారు గడిపారు. పుట్టుకతోనే దేశభక్తి సమాజ నిష్ఠ వారికి అబ్బినవి. చిన్నతనంలోనే కేశవుని మిత్రులకు, చుట్టుప్రక్కలవారికి, ఇంట్లోవారికి ఈ విషయం అర్థమౌతూ వచ్చింది. ఇంగ్లండు రాణి విక్టోరియా పరిపాలన ప్రారంభమై 60 సంవత్సరాలు నిండాయని బ్రిటిష్ ప్రభుత్వం దేశవ్యాప్తంగా ఉత్సవాలు పెద్దయెత్తున నిర్వహించింది. ఆ సందర్భంగా నాగపూర్‌లోని పాఠశాలలలో 1897 జూన్ 22వ తేదీన బాలబాలికలకు మిఠాయిలు వంచిపెట్టారు. విక్టోరియా రాణి ఈ దేశంలో సాగిస్తున్నది పరాయి ప్రభుత్వం కనుక పంచిపెట్టిన మిఠాయి తినటం పూర్తిగా అనుచితం అనే గొప్ప ఆలోచన ఎనిమిదేండ్ల కేశవుని మనసులో మెదిలింది. ఆ మిఠాయి పొట్లం ఒక మూలన విసరి పారేశాడు. ఇంకో నాలుగేళ్ళు గడిచాక 1901లో ఏడవ ఎడ్వర్డ్ పట్టాభి-

షేకోత్సవం నాగపూర్‌లో ఎంప్రెస్‌మిల్స్‌వారు అట్టహాసంగా జరిపినప్పుడు కూడ అందులో పాల్గొనలేదు. "పరాయి రాజు పట్టాభిషేకోత్సవం జరుపుకొనడం సిగ్గుచేటు"




- అన్నాడు బాలకేశవుడు. పాఠశాలలో చదివే రోజుల్లో నాగపూర్‌లోని సీతాబర్డీ కోటపై ఆంగ్లేయుల జండా యూనియన్ జాక్ ఎగురుతూ ఉండడం చూసి ఆయన తట్టుకోలేక పోతుండేవాడు. ఆ జండా స్థానంలో భగవాధ్వజాన్ని ఎగురవేయాలనే కోరిక పుడుతుండేది. ఒక రోజున ఆయనకొక విచిత్రమైన ఆలోచన వచ్చింది. ఆ కోటదాకా ఒక సొరంగం త్రవ్వి ఎవరికీ తెలియకుండా దానిలోంచి అక్కడకు పోయి ఆ జండాను పీకి పారేసి మన జండా ఎగరేయాలనుకున్నాడు. అనుకొన్నట్లుగానే తన స్నేహితులను కూడగట్టుకొని సొరంగం త్రవ్వడం ప్రారంభించాడు కూడా. ఆ విషయం పెద్దవాళ్ళ దాకా వెళ్ళాకకాని ఆ ప్రయత్నం విరమించలేదు.






## నర నరాల్లో దేశభక్తి

బాల్యంలోనే ప్రకటితమైన కర్తవ్యోన్ముఖ దేశభక్తి భావన హెడ్గేవార్‌లో జీవితాంతం అవిచ్ఛిన్నంగా నిలచిపోయి ఆయన జీవితాన్ని ప్రకాశవంతం చేసింది. వారు నాగపూర్‌లో నీల్‌సిటీ హైస్కూలులో చదువుతున్న రోజుల్లో ఆంగ్లేయ ప్రభుత్వం కుతంత్రంతో 'రిస్లే సర్క్యులర్' జారీ చేసింది. వందేమాతరం ఉద్యమం తీవ్రంగా జరుగుతున్న రోజులవి. విద్యార్థులు సభల్లోగానీ, ప్రదర్శనలలో గానీ పాల్గొనకూడదనీ, పాల్గొంటే వారి పేర్లు ఉపాధ్యాయులు ప్రభుత్వానికి పంపించాలనీ ఈ సర్క్యులర్ ద్వారా






ప్రభుత్వం ఆదేశించింది. స్వాతంత్ర్య పోరాటంనుంచి విద్యార్థులను దూరంగా ఉంచడానికి ఉద్దేశించిన సర్క్యులర్ అది. కేశవరావ్ హెడ్గేవార్‌లో విద్యార్థిగా ఉన్న రోజులలోనే నేతృత్వ లక్షణాలు పుష్కలంగా ఉండేవి. పాఠశాల తనిఖీకి గాను ఇన్‌స్పెక్టర్ వచ్చినప్పుడు ఆయనను "వందేమాతరం" నినాదంతో స్వాగతించాలని నిశ్చయం చేసుకోవడమేగాక అది విజయవంతంగా చేసి చూపించాడు హెడ్గేవార్. ప్రతి తరగతి గదిలోనూ ఈ నినాదం మారుమ్రోగడంతో పాఠశాల గందరగోళంగా తయారైంది. ఆ రోజుల్లో బ్రిటిష్ అధికారులకు వందేమాతరం నినాదం అంటే ఒళ్ళంతా జెర్రులు ప్రాకినట్లుండేది. దీనితో అధికారులు హెడ్గేవార్‌ను పాఠశాలనుంచి బహిష్కరించారు. ఏ పాఠశాలలోను ప్రవేశం దొరకలేదు. ఆ తర్వాత పూనా నుండి అతి కష్టంమీద మెట్రిక్ పూర్తి చేశాడు.

'కేసరి', 'కాల్' మొదలైన వార్తాపత్రికలలో వెలువడిన నిప్పులు చెరిగే రచనలు, లోకమాన్య తిలక్ సింహగర్జనలు, ఆంగ్లేయ సామ్రాజ్యవాదపు దమన నీతి, బెంగాల్ విభజన సందర్భంగా పెల్లుబికిన ఆందోళన, విప్లవకారుల సాహస కృత్యాలు, వారి బలిదానాలు - వీటన్నిటి ప్రభావం కేశవరావుపై బలంగా పడింది. కేశవరావు నిర్భయుడు, సాహసికుడు. దేశంకోసం ఎంతటి త్యాగానికయినా వెనుదీయని యువకుడు. ధనార్జన, పేరు ప్రతిష్ఠలు, విలాస జీవితం కావాలన్న కోరిక ఆయన మనస్సులో ఎన్నడూ జనించలేదు. విప్లవకారుల సాహచర్యం లభిస్తే విదర్భ ప్రాంతంలో కొంత పనిచేయవచ్చుననే ఉద్దేశ్యంతో వారు 1910లో కలకత్తాలో

ఉన్న నేషనల్ మెడికల్ కాలేజీలో డాక్టర్ విద్యను అభ్యసించడానికి ప్రవేశించారు. అక్కడ పులిన బిహారీదాస్ నాయకత్వంలో 'అనుశీలన సమితి' పేరుతో ఒక విప్లవకారుల సంస్థ పని చేస్తుండేది. హెడ్గేవార్ ఆ సమితి రహస్య దళంలో ప్రవేశం సంపాదించారు.




## విప్లవోద్యమంలో కీలకపాత్ర :

కలకత్తా మెడికల్ కాలేజీలో ఐదు సంవత్సరాల కోర్సు పూర్తిచేసి వారు డాక్టర్ అయ్యారు. ఈ ఐదు సంవత్సరాల కాలంలో వివిధ రంగాలలో అగ్రగాములైన నాయకుల స్నేహం సంపాదించారు. వివిధ విప్లవదళాలతో .పరిచయాలేర్పరచుకొన్నారు. రహస్యంగా ఆయుధాలు చేరవేయడంలో కావలసిన జాగ్రత్త, సంయమనమూ, ప్రణాళికా బద్ధమైన కృషి - ఇలాంటి లక్షణాలు వారిలో ఉండేవి. ప్రాంతం, భాష వేరైనప్పటికీ అది వారి పనికి అడ్డం కాలేదు. బెంగాలీ భాషను నేర్చుకొన్నారు. అనేక మందితో చక్కటి స్నేహ సంబంధాలు ఏర్పరచుకొన్నారు. వరదలు, కలరా మొదలైన కష్టాలు వచ్చినప్పుడు యువకులైన తన మిత్రులను వెంటపెట్టుకొని నిస్వార్థబుద్ధితో ఎంతో కష్టపడి సేవచేశారు. డాక్టరు పరీక్ష పూర్తిచేసి 1915లో నాగపూర్‌కు తిరిగి వచ్చేనాటికి మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతోంది. విప్లవోద్యమాలను నిర్మాణం చేసి బ్రిటిష్ వారిని తరిమి వేయడానికి అది సరైన తరుణమని డాక్టర్‌జీ భావించారు. అందుచేత ఆపదలను ఎదుర్కొంటూ కూడ ఆ ఉద్యమాలలో పాల్గొన్నారు.




కాని సాయుధ పోరాటానికి కొన్ని పరిమితులు ఉన్నాయన్న సంగతి త్వరలోనే గుర్తించారు. ఈ మార్గంలో పరాయి ప్రభువులైన బ్రిటిష్‌వారిని తరిమి కొట్టడం సువిశాల భారతదేశంలో సాధ్యంకాని పని అని కూడ అనిపించింది. ఎంత జాగరూకతతో విప్లవోద్యమ కార్యవిస్తరణకు పాటుపడ్డారో అంతకంటే ఎక్కువ జాగ్రత్తతో నిదానంగా ప్రక్కకు తొలిగారు. ఇలా కొన్ని సంవత్సరాలు నిష్ఫలంగానే గడచి పోయాయి. కాని ఒక మార్గంలో విజయం చేతికందనంత మాత్రాన నిరాశా నిస్పృహలతో కృంగిపోయే మనస్తత్వం కాదు వారిది.

## ఉద్యమాల పర్వం

విప్లవోద్యమం సాగించేందుకు సంపాదించిన ఆయుధాలను భద్రపరుస్తూనే, విప్లవ కారులతో కలసి పనిచేస్తూనే ఆయన లోకమాన్య తిలక్‌కు అనుచరులై కాంగ్రెస్



ఉద్యమాలలో దూకారు. లోకమాన్య తిలక్ అంటే డాక్టర్‌జీకి అపారమైన శ్రద్ధ. ఒకసారి కలకత్తాలో బహిరంగసభ జరుగుతున్నప్పుడు ఒక వక్త తిలక్ మహాశయుని నిందిస్తూ మాట్లాడితే డాక్టర్‌జీ వేదికపైకి ఎక్కి ఆ వ్యక్తి చెంప పగులగొట్టారు. సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని కోరేవారిలో ఆయన ఒకరు. ఆయన తమ వాదాన్ని తీవ్రమైన పదజాలంతో ప్రతిపాదించేవారు. అవకాశం దొరికినపుడెల్లా ఉత్సాహ ఉద్వేగాలతో ఉపన్యసించేవారు.

భారత రాజకీయాకాశంలో మహాత్మా గాంధీ ఉదయిస్తున్న రోజులవి. దేశమంతా అసంతృప్తి వ్యాపించి ఉంది. ఇందుకు రెండు కారణాలున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వం 'రౌలట్' చట్టాన్ని ప్రవేశపెట్టటం మొదటి కారణం. ఈ చట్టం ద్వారా ప్రభుత్వానికి నిరంకుశ అధికారాలు సంక్రమిస్తాయి. ఏ వ్యక్తినైనా కేవలం అనుమానంపైన దేశద్రోహ నేరంమోపి జైలులో పారేయవచ్చు. ఏ విధమైన విచారణ లేకుండా జైలులో ఉంచవచ్చు. ఏకొద్దిపాటి అలజడి జరిగినా నిర్బంధంలోకి తీసుకోనూ వచ్చు ఈ పాశవిక చట్టాన్ని వ్యతిరేకిస్తూ అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో శాంతియుతంగా జరుగుతున్న సభపైన కాల్పులు జరిపించి వందలాదిమందిని పొట్టన పెట్టుకొన్నాడు ఆంగ్లేయ అధికారి జనరల్ డయ్యర్. రెండోకారణం ఆంగ్లేయ సామ్రాజ్య వాదులు టర్కీలోని ఖలీఫాను గద్దె దింపినందున ముస్లింలు బ్రిటిష్ ప్రభుత్వమంటే మండిపడుతూ ఉండటం. ఈ రెండు కారణాలవల్ల దేశంలో అలుముకొని ఉన్న అసంతృప్తిని చక్కగా ఉపయోగించుకొని స్వాతంత్ర్యోద్యమం వేగం పుంజుకొనేటట్లు చేశారు మహాత్మాగాంధి. టర్కీలో ఖలీఫాను తొలగించినందుకు నిరసనగా జరుగుతున్న ఖిలాఫత్ ఉద్యమాన్ని ఉపయోగించుకొని ఆంగ్లేయులకు వ్యతిరేకంగా హిందూ ముస్లిం ఫ్రంట్ నిర్మాణం చేయాలనే నిశ్చయంతో సత్యాగ్రహో ద్యమానికి పిలుపు నిచ్చారు గాంధీజీ. 1919లో అమృతసర్ కాంగ్రెసు మహాసభలు ఉద్రిక్త వాతావరణంలో జరిగాయి. డాక్టర్‌జీ ఆ మహాసభలలో పాల్గొన్నారు. ఆ తర్వాత సంవత్సరంలో మహాసభలు నాగపూర్‌లో జరగాలని నిర్ణయమైంది.

1915-1920 మధ్య నాగపూర్‌లో జరిగిన ప్రజా ఉద్యమాలలో డాక్టర్‌జీ అమితోత్సాహంతో పాల్గొన్నారు. ఉపన్యాసాలూ, సభలూ, సమావేశాలతో ఎప్పుడూ తీరిక లేకుండా ఉండేవారు. సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలన్న కోర్కె యువతలో బలపడేందుకు ఎక్కువ శ్రద్ధ తీసుకునేవారు. చేపట్టిన పనిలో తాదాత్మ్యత చెందడం కారణంగానూ, అందరినీ కలుపుకొని నిస్వార్థంగా పనిచేయగల సామర్థ్యం ఉన్న

కారణంగానూ నాయకులందరూ డాక్టర్‌జీ సహకారం ఎంతో విలువైందిగా భావించేవారు. డాక్టర్‌జీ తానసుకొన్న విషయాన్ని తికమకలు లేకుండా ఎంతో సాహసంతో సూటిగా నాయకుల ముందుంచేవారు. 1920లో నాగపూర్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభలలో డాక్టర్‌జీలోని ఈ లక్షణాలను అందరూ గమనించారు. అంతేకాదు అభిప్రాయ భేదాలున్నప్పటికీ సంస్థాగతమైన క్రమశిక్షణను ఎలా పాటించాలనే విషయంలో కూడ డాక్టర్‌జీ ఉదాహరణగా నిలచారు.

## *క్రమశిక్షణ ఆయనకు వెన్నతోబెట్టిన విద్య:*

నాగపూర్ కాంగ్రెసు మహాసభలు లోకమాన్య తిలక్ అధ్యక్షతన జరగాలన్న తీవ్రమైన అభిలాష విదర్భ ప్రాంత కార్యకర్తలకు ఉండేది. కాని 1920 ఆగష్టు 1న తిలక్ మహాశయుడు మరణించడంతో ఆ కోర్కె తీరకుండా పోయింది. ఈ విచారకరమైన వార్త నాగపూర్ చేరగానే అధ్యక్షస్థానాన్ని ఎవరు అలంకరిస్తారన్న చర్చ ప్రారంభమైంది. చివరికి నాగపూర్‌లోని జాతీయవాదులు ఒకప్పుడు విప్లవకారుడై ఉండి పుదుచ్చేరిలో తపస్సులో నిమగ్నమై ఉన్న అరవింద ఘోష్‌ను అధ్యక్షునిగా ఆహ్వానించాలన్నారు. డాక్టర్ మూంజే, డాక్టర్ హెడ్గేవార్‌లు పుదుచ్చేరి వెళ్ళి వారిని ఒప్పించేందుకు తీవ్రంగా కృషి చేశారు. కానీ ఆధ్యాత్మిక చింతనతో గడపాలని నిశ్చయించుకొన్న అరవిందబాబు మళ్ళీ రాజకీయ రంగంలో అడుగు పెట్టేందుకు యిష్టపడలేదు. అప్పుడు మితవాదులలో ఒకరైన శ్రీ విజయ రాఘవాచారిని అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. డాక్టర్‌జీకి ఇది నచ్చలేదు. కాని ఒకసారి నిర్ణయమైన తర్వాత మహాసభలు జయప్రదం కావడానికి అహర్నిశలూ కష్టించి పని చేశారు. మహాసభల కోసం నాగపూర్ విచ్చేసిన పద్నాలుగున్నర వేలమంది కాంగ్రెసు ప్రతినిధులకు భోజనం, వసతి సమకూర్చడంలోనూ, మహా సభలకు ఏర్పాట్లు చేయడంలోనూ కృషిచేసిన వలంటీరు దళానికి డాక్టర్ ఎల్.వి. పరంజపేతో పాటు డాక్టర్ హెడ్గేవార్ ప్రముఖులుగా పనిచేశారు. వారు చేసిన చక్కని ఏర్పాట్లు చూసి మహాసభలకు విచ్చేసిన వారంతా గొప్పగా ప్రశంసించారు.

ఈ నాగపూర్ సభలలోనే ఖిలాఫత్ ఉద్యమాన్ని సమర్థించాలన్న ప్రతిపాదన అంగీకరించ బడింది. నిజం చెప్పాలంటే గాంధీజీ ముస్లింల సహకారానికి మితిమీరిన విలువనిచ్చి వారిని నెత్తిన పెట్టుకోవడం డాక్టర్‌జీకి నచ్చలేదు. గాంధీజీకి తమ అభిప్రాయం తెలియపరచారు కూడ! అలాగే 'సంపూర్ణ స్వాతంత్ర్యం' పైననే దృష్టిని కేంద్రీకరించాలన్నది కూడ డాక్టర్‌జీ అభిలాష. మరొక ముఖ్యవిషయం




స్వాగత సమితి తరఫున విషయ నిర్ణాయక సమితికి డాక్టర్‌జీ ఒక ప్రతిపాదన పంపిస్తూ దానిలో 'హిందూస్థాన్‌లో ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పి పెట్టుబడి దారీ దేశాల కబంధ హస్తాలనుండి దేశానికి విముక్తి కలిగించడమే కాంగ్రెస్ పార్టీ ధ్యేయం' అని వ్రాసి పంపించారు. కాని ఆనాటి కాంగ్రెసు నేతలు ఇంత పెద్ద ముందడుగు వేయడానికి సిద్ధంగా లేరు. ఈ రెండు ప్రతిపాదనలను చెత్తబుట్టలో పారేశారు. అయినా అభిప్రాయ భేదాలున్నప్పటికీ ఆ పార్టీలో కొనసాగుతున్నంతవరకూ ఆ సంస్థ నిర్ణయాలు శిరోధార్యాలుగా భావించి ప్రజలలో జాగృతిని కల్గించేందుకు పట్టుదలతో పనిచేయాలనే క్రమశిక్షణ వారిలో వుంది. నాగపూర్ కాంగ్రెస్‌లో గాంధీజీ నేతృత్వం తిరుగు లేనిదిగా రూపొంది వారి మార్గదర్శనంలో సహాయ నిరాకరణ ఉద్యమం ప్రకటించ బడింది. ఖిలాఫత్ ఉద్యమాన్ని నెత్తిన వేసుకోవడంవల్ల ప్రయోజనం చేకూరుతుందనిగాని, వెంటనే స్వరాజ్యం లభిస్తుందని గాని డాక్టర్‌జీ ఎన్నడూ భావించ లేదు. కానీ సమాజాన్ని జాగృతం చేయడానికి లభించిన అవకాశాలు వారు ఏమాత్రం జారవిడుచుకోలేదు. ఖిలాఫత్ ఉద్యమాన్ని ఆ విధంగా ఉపయోగించుకొని విదర్భ అంతటా తుఫానువేగంతో దూసుకుపోతూ నిప్పురవ్వలు వెదజల్లే తమ ఉపన్యాసాలతో గ్రామీణ ప్రాంతాలలో పెద్ద సంచలనం సృష్టించారు.

## పోరాటవేదికగా న్యాయస్థానం:

చివరికి ఈ ఉపన్యాసాల కారణంగా వారిపైన రాజద్రోహ నేరం మోపబడింది. న్యాయస్థానాలలో ఎవరిపైన నేరం మోపబడినప్పటికి వ్యతిరేకంగా

వాదించకుండా శిక్షను అనుభవించాలనేది గాంధీజీ అభిప్రాయం. కానీ డాక్టర్‌జీ న్యాయస్థానాన్ని కూడా తమ పోరాటవేదికగా మార్చుకొని కేసులో వాదించారు. న్యాయస్థానంలో డాక్టర్‌జీ వాఙ్మాలం విస్పష్టంగాను, దేశభక్తి ప్రపూరితంగానూ ఉంది. భావోద్వేగంతో కూడిన పదప్రయోగం జరిగింది అందులో. అది విన్న తర్వాత న్యాయమూర్తి "ఈ నేరానికి సంబంధించిన అసలు ఉపన్యాసంకంటె న్యాయస్థానంలో దాన్ని సమర్థిస్తూ చేసిన ఉపన్యాసం మరింత రాజద్రోహకరంగా వుంది" అన్నారు. డాక్టర్‌జీకి ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష విధించారు. అది ఆయన ఆనందంగా అనుభవించారు.

## ఆందోళన కలిగించిన అనుభవాలు:

కారాగారంనుండి విడుదలైరాగానే ప్రతిచోట ప్రజలనుంచి ఆయనకు ఘనమైన స్వాగతం లభించింది. అయితే యిటువంటి స్వాగతాలకు మురిసి పోవడం గాని, ఆందోళన కాస్త చల్లబడితే నిరాశతో కృంగి పోవడంగాని వారి తత్త్వం కాదు. అంతవరకు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని గడించిన అనుభవాలు నెమరు వేసుకుంటే ఆయన మనస్సులో అనేక ప్రశ్నలు ఉత్పన్నమైనాయి. ఇంకొక మార్గం వెదకాలని వారు అనుకొన్నారు. ఈలోగా ఖిలాఫత్ ఉద్యమం విఫలమైంది. ఖిలాఫత్ ఉద్యమాన్ని మొదట దెబ్బతీసింది టర్కీలోని కెమాల్‌పాషా అనుచరులైన తురుష్క యువకులే! కాని అది విఫలం కావడానికి కారణం హిందువులేనంటూ భారతీయ ముస్లింలు ఆరోపించారు. హిందువులపైన అత్యాచారాలు జరపాలనే ప్రవృత్తి వారిలో

బలపడింది. దానితో డాక్టర్‌జీ మస్తిష్కం ఆలోచనలతో వేడెక్కింది. మలబార్‌లో మోప్లాల ద్రోహపూరిత చర్యలు, హిందువులపై మాటలలో వర్ణించలేని అత్యాచారాలు విన్న తర్వాత వారికి మరింత ఆవేదన కల్గింది.

కారాగారంనుంచి విముక్తిపొంది నాగపూర్ ప్రజాజీవనంలో పాలుపంచుకొంటున్న తరుణంలో కూడ వారు ముసల్మానుల దౌర్జన్య చర్యలు గమనిస్తూ వచ్చారు. హిందువులు భక్తి ప్రపత్తులతో, ఆనంద ఉత్సాహాలతో శాంతియుతంగా జరుపుకొనే ఊరేగింపులపై ముస్లింలు దాడి చేయడం, దానితో హిందువులు భయపడి మసీదుల ముందు ఊరేగింపులు నిలిపివేయవలసి రావడం వలన ఉద్రిక్త వాతావరణం ఏర్పడుతూ ఉండేది. దీనికితోడు ముస్లింల ఒత్తిడికి లొంగిన ప్రభుత్వం మసీదుల ముందునుంచి హిందువుల ఊరేగింపులు వెళ్ళకూడదని ఉత్తర్వులు జారీచేస్తూ ఉండేది. 1923 లో విధించిన ఈ నిషేధాజ్ఞలను ధిక్కరిస్తూ హిందువులు హిందూదేశంలో కాకపోతే మరెక్కడ తమ ఊరేగింపులు జరుపుకోవాలంటూ భజనమండలులతో రాజాలక్ష్మణరావు భోంస్లే సహకారంతో *'దిండీ' సత్యాగ్రహాన్ని నిర్వహించి మసీదుల ముందునుంచి మేళతాళాలు వాయించుకొంటూ ఊరేగింపును విజయవంతంగా నిర్వహించారు డాక్టర్‌జీ. ఈ సత్యాగ్రహాన్ని అందరూ మెచ్చుకొన్నారు.

## *కనుల ఎదుట క్రొత్తవెలుగు:*

ఈ రోజులలోనే డాక్టర్‌జీ హిందూ మహాసభ కార్యక్రమంలో పాల్గొనడం ప్రారంభించారు. 1922-25 మధ్యకాలంలో అనేక సామాజిక కార్యక్రమాలలో అత్యంత ఉత్సాహంగా పాల్గొంటూఉన్నప్పటికీ తాను జీవితంలో సాధించవలసిన లక్ష్యాన్ని గురించి తీవ్రంగా అన్వేషణ చేయసాగారు. అన్వేషణ కొనసాగుతూనే ఉంది. యువకులతో సత్సంబంధాలు పెంచుకొంటూనే ఉన్నారు. చరిత్రను నిశితంగా పరిశీలిస్తూనే ఉన్నారు. ఈ అంతరంగ మథనంనుంచే అమృతం ఆవిర్భవించింది. వారికి భావి కార్యక్రమం దృగ్గోచరమైంది. సంఘాన్ని స్థాపించాలన్న ఆలోచన మనస్సులో స్థిరపడింది.

---

* దిండీ - మేళతాళాలతో భజనమండలుల ఊరేగింపు

# 2

సంఘాన్ని స్థాపించాలని నిశ్చయించుకోవడంతో అంతకు ముందు మనస్సులో ముసురుకొన్న ఆలోచనలు తెరిపినపడ్డాయి. సంఘం అంటే హిందువుల సంఘటిత శక్తి. హిందువులనే ఎందుకు సంఘటిత పరచాలంటే హిందువులే ఈ దేశపు భాగ్యవిధాతలు కాబట్టి. ఈ దేశానికి సహజ వారసులు వారే. ఈ దేశం వారిదే. ఈ దేశ ప్రగతిగాని, పతనంగాని వారిపైనే ఆధారపడి ఉంది. ఇది హిందూ రాష్ట్రం అనేది చారిత్రిక సత్యం. మతోన్మాదంతో జాతిని చీలదీయడానికి ప్రయత్నిస్తున్న ముస్లింలను, వారికి పురిఎక్కిస్తున్న ఆంగ్లేయులను ఎదుర్కోనాలంటే - ఇచటి జాతీయులను - అంటే హిందువులను సంఘటిత పరచడమే ఏకైక మార్గమనే నిశ్చయానికి వచ్చారు డాక్టర్‌జీ.

సంఘానికి ఆధారం హిందూరాష్ట్ర సిద్ధాంతమే అన్నారు వారు. దానిని వ్యవహార రూపంలో తెచ్చేందుకు ఎంతో శ్రమించారు. కేవలం ఒక సిద్ధాంతం నిజమైనదైనంతమాత్రాన సరిపోదు. దానిని ప్రపంచం అంతా అంగీకరించేటట్లు చేసేందుకు దానివెనుక ప్రబలమైన శక్తి ఉండాలి. సంఘటన ద్వారా శక్తినిర్మాణం జరుగుతుంది. హిందూ సమాజంవైపు, హిందూస్థానంవైపు దుష్టబుద్ధితో దృష్టిని సారించే ధైర్యం ఎవరికీ కలుగనంతటి అజేయమైన హిందూ సంఘటన నిర్మాణం చెయ్యాలి. అన్ని సమస్యలకూ ఏకైక పరిష్కారమైన ఈ కార్యమే వారి జీవన కార్యమైంది. స్వాతంత్ర్య సముపార్జన అన్నది ఈ కార్యానికి మొదటిమెట్టు.

## అపురూపమైన కార్యపద్ధతి

డాక్టర్‌జీ ఈ నిర్ణయానికి వచ్చేనాటికి హిందూరాష్ట్ర భావన దేశంలో క్రొత్తదేమీ కాదు. 1922 లోనే స్వాతంత్ర్యవీర సావర్‌కర్ 'హిందుత్వ' అనే శీర్షికతో ఒక పరిశోధనాత్మక వ్యాసం వ్రాశారు. అంతకుముందు కూడ స్వామి వివేకానందవంటి పలువురికి "రాష్ట్రం" (జాతి) అంటే యిలాంటి అవగాహనే ఉండేది. సంఘటన కావాలనుకోవడం కూడ క్రొత్త విషయం కాదు. కాని ఆచరణలో సంఘటన కార్యాన్ని చేపట్టిన వారు లేరు. సంఘటన గురించీ, సంఘటన నిర్మాణంగురించీ స్పష్టమైన అవగాహన ఎవరికీ లేదు. డాక్టర్‌జీ మాత్రమే అనేకమైన ఉద్యమాలలో పాల్గొంటూ, సభలూ, సమావేశాలూ అనేకం నిర్వహిస్తూ, వివిధ సంస్థలలో, యువజన బృందాలతో కలసి పనిచేస్తూ ప్రత్యక్ష అనుభవాన్ని గడిస్తూ కూడ నిరంతరం సంఘటన నిర్మాణం గురించే ఆలోచిస్తుండేవారు. ఎంత ఆలోచించినా విశుద్ధ దేశభక్తితో ప్రేరితులై, వ్యక్తిగత అహంకారానికి దూరంగా, క్రమశిక్షణ, సచ్ఛీలమూ కలిగిన వ్యక్తుల నిర్మాణానికి పూనుకొని పనిచేసినవారు కనపడలేదు. అందుకు వ్యవస్థ కూడా లేదు. అందుచేతనే అనేక ఉద్యమాలు సముద్రంలోని అలలవలె పొంగుతూ, చల్లారుతూ ఉండేవి. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్న వారిలో చాలామంది దేశం, సమాజం, స్వాతంత్ర్యం అన్న వాటిని మర్చిపోయి తమ స్వార్థప్రయోజనాలు నెరవేర్చుకోవడంలో నిమగ్నమై పోయిన ఉదంతాలు డాక్టర్‌జీ చూచారు. అందుచేత ఆ రోజుల్లో ప్రజా జీవనంలోనూ, స్వాతంత్ర్య పోరాటంలోనూ సాగుతున్న వివిధ ప్రయత్నాలకు భిన్నంగా విశిష్టమైన ఒక క్రొత్త పద్ధతిని తన ప్రతిభా వ్యుత్పత్తులతో డాక్టర్‌జీ కనుగొన్నారు. క్రమశిక్షణాయుతంగా ప్రతినిత్యం కొనసాగే ఈ పద్ధతిలో స్థిరమైన సంస్కారాలు కలుగజేసే సామర్థ్యం ఉంది. నియమంగా కొంత సమయాన్నివ్వడానికి సిద్ధపడిన వ్యక్తులలో ఆ అలవాటు బలపడేటట్లు చేసి క్రమక్రమంగా తను మన ధనాలతో సమాజ పరమేశ్వరుని సేవకై జీవితాన్ని వినియోగించే సంసిద్ధతను కలుగజేయడమే ఈ కార్యపద్ధతిలోని వైశిష్ట్యం. హిందూరాష్ట్ర ఉన్నతికి ఈ అద్భుత కార్యపద్ధతిని దేశం అంతటా వ్యాపింపజేయడం అవసరమని డాక్టర్‌జీ దృఢంగా విశ్వసించారు.

### సంఘాంకురం :

తాము నిర్మించదలచిన సంఘటనా కార్యాన్ని ఆయన అనేకమంది పెద్దలకు విశదపరిచారు. వారితో చర్చించారు. పెద్ద వయసులో వున్న సామాజిక కార్యకర్తలకు దాని విశిష్టత సరిగా అర్థంకాలేదు. చివరికి కొద్దిమంది యువకులను

సమీకరించి వారి సమావేశంలో 'మనం సంఘాన్ని స్థాపిస్తున్నాం' అన్న ప్రకటన చేశారు. అది కలియుగాబ్ది 5027 వ సంవత్సరం (క్రీ.శ 1925) విజయదశమి పర్వదినం. ఆ రోజుననే సంఘానికి బీజారోపణ జరిగింది. ఆ సమావేశంలో ప్రకటన అయితే జరిగింది కాని సంఘం పేరులో 'రాష్ట్రీయ' అనే శబ్దంకాని, 'స్వయంసేవక్' అన్న శబ్దంకాని లేవు. సుదీర్ఘమైన ఆలోచన తర్వాత నిశ్చయించుకొన్న తన జీవన కార్యాన్ని సకల పురుషార్థాలకు ప్రేరణ నిచ్చే ఆ జాతీయ పర్వదినాన శుభారంభ మొనరించారు. అప్పుడు డాక్టర్‌జీ వయస్సు కేవలం 36 సంవత్సరాలు.




ఈనాడు రాష్ట్రీయ స్వయంసేవక సంఘం వటవృక్షంవలె విశాలమై శాఖోప శాఖలుగా విస్తరించి తన విరాట్ స్వరూపాన్ని తిలకింపచేస్తోంది. కాని దాని ప్రారంభం ఏ పరిస్థితులలో జరిగిందో బహుశా మనకు తెలియకపోవచ్చు. తెలుసుకొన్న తర్వాత నిజంగా డాక్టర్‌జీ ఒక మహాద్భుతం చేశారనిపిస్తుంది.

ఒక సామాన్య వ్యక్తి నిలబడి 'ఇది హిందూ రాష్ట్రం' అని ఎలుగెత్తి చాటాడు. హిందూరాష్ట్రంయొక్క స్వాతంత్ర్యానికీ, అచంచలమైన సామర్థ్య సముపార్జనకూ ఒక సంఘటనను నిర్మించాలని పూనుకొన్నాడు. అయనకు సాధన

సంపత్తులు కాని, పెద్దపెద్ద నాయకుల అండదండలుగానీ లేవు. పోనీ హిందూరాష్ట్ర భావనకు ప్రజలలో ఆదరణ ఉందా అంటే అదీలేదు. అంతేకాదు, పరిస్థితి పూర్తిగా వ్యతిరేకంగా కనిపించింది. ఇక సమాజం విషయం చూద్దామంటే కుల, మత, భాష, ప్రాంతాల వారీగా చీలిపోయి దీర్ఘకాలిక బానిసత్వంలో పరప్రభువుల భేదోపాయానికి గురియై ఉంది. ఎప్పటికైనా 'హిందూ' అనే పేరుతోనే ఈ సమాజం సంఘటిత మౌతుందంటే సామాజిక చింతన వున్న పెద్దవాళ్ళకు కూడ అది మింగుడు పడని విషయమైంది. 'హిందూ రాష్ట్ర' భావనను అర్థం చేసుకోవడం సంగతి అలా ఉంచి - ఆ మాట ఉచ్చరిస్తేనే పిచ్చివాళ్ళ క్రింద జమకట్టే పరిస్థితి. అయినా సామాన్య వ్యక్తి అయిన డాక్టర్‌జీ అసామాన్యమైన రీతిలో దృఢమైన ఆత్మవిశ్వాసంతో హిందూ రాష్ట్రం, హిందూ సంఘటన - ఈ రెండూ వాస్తవాలని చాటి చెప్పారు. సంస్కృతంలో ఒక సూక్తి ఉంది - "క్రియాసిద్ధి: సత్వేభవతి మహతాం నోపకరణే"- అనగా గొప్పవారి కార్య సాఫల్యత వారి సత్సంకల్పంపైన ఆధారపడి ఉంటుంది కాని సాధన సంపత్తుల పైన కాదు. ఈ సూక్తి అక్షరాల సత్యం అని నిరూపించారు డాక్టర్‌జీ.

## సంఘానికి పేరు పెట్టారు:

1925 విజయదశమి రోజున సంఘస్థాపన జరిగింది. కాని, సంఘముయొక్క పూర్తి కార్యపద్ధతి నిశ్చయం కాలేదు. అది క్రమంగా వికసించనారంభించింది. అన్నిటి కంటె ముందు 'రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్' అనేపేరు నిశ్చయమైంది. సభ్యులందరి అభిప్రాయాలూ తెలుసుకొని కూలంకషంగా చర్చించిన తర్వాతనే ఈ పేరు నిశ్చయించారు.

హిందూ సంఘటనను 'రాష్ట్రీయ' అని పిలవడం ఆ రోజుల్లో అద్భుతమైన సంగతి. అప్పుడు హిందూ మహాసభ ఉన్నది. ఇంకా కొన్ని చిన్న చిన్న హిందూ సంస్థలు కూడ ఉండేవి. కానీ హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు, పార్శీలు కలిసి ఉంటేనే అది రాష్ట్రీయ (జాతీయ) కార్యం అని భావించబడేది. 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' పార్టీని అన్నిచోట్ల 'రాష్ట్రీయ' సంస్థగా పరిగణించేవారు. అలాంటి పరిస్థితిలో సంఘం పేరులో 'రాష్ట్రీయ' అనే పదం వాడడం అప్పటివరకూ ప్రచారంలో ఉన్న అవగాహనకు భిన్నమే అవుతుంది. కానీ డాక్టర్‌జీ బాగా ఆలోచించే ఈ పదం వాడారు. ఆ సందర్భంగా మాట్లాడుతూ - హిందుస్థాన్‌లో హిందువుల సంఘటన 'రాష్ట్రీయ'మే అవుతుంది అన్నారు. దానిని మతతత్వం అనడానికి వీలులేదు, హిందువులకై చేసే పని ఏదైనా 'రాష్ట్రీయ' కార్యమే అన్నారు. ఈ విషయంలో ఎప్పుడూ డాక్టర్‌జీ రాజీపడలేదు.

ఆనాటి సామాజిక జీవనంలో 'స్వయంసేవక్' (వలంటీర్) అన్నపదానికి ఏమాత్రం గౌరవం లేదు. ఈనాటికీ పరిస్థితి కొంతవరకు అలాగే ఉంది. వలంటీర్లు అంటే నాయకులు చెప్పే చిన్న చిన్న పనులు చేసిపెట్టేవారని, ఆలోచించటం వారి పని కానే కాదని అనుకొనేవారు. కుర్చీలు, టేబుళ్ళు సర్దడం, పట్టాలుపరచడం, వాటిని సరిచేయడం, వార్తాహరులుగా ఉండడం మొదలైన పనులు సేవాదళ కార్యకర్తలతో చేయిస్తుండేవారు. నాయకులు వలంటీర్లచేత ఇలాంటి పనులు చేయిస్తారనే అనుభవం నాగపూరు కాంగ్రెసు మహాసభలు జరిగినప్పుడు డాక్టర్‌జీకి కలిగింది. కాని డాక్టర్‌జీ 'స్వయంసేవక్' అన్నపదం ఈ అర్థంలో వాడలేదు. 'రాష్ట్రీయ' అన్న పదానికీ, 'స్వయంసేవక్' అన్న పదానికీ స్పష్టమైన అర్థం చెప్పారు. స్వయం ప్రేరణతో దేశకార్యంలో నిమగ్నమై పనిచేసేవాడు, అందుకు అవసరమైన సమయం ఇచ్చేవాడు, నిరహంకార బుద్ధితో దేశకార్యం చేసేవాడు, సర్వస్వాన్ని సమర్పించ డానికి సిద్ధపడేవాడు, క్రమశిక్షణాయుత జీవనాన్ని కోరుకొనేవాడు, తీవ్రమైన దేశభక్తి భావంతో నిండినవాడు "స్వయంసేవక్" ఈ భావన ప్రారంభంనుండే వారు ప్రచారంలోకి తెచ్చారు. 'అయ్యా చిత్తం' అంటూ నాయకుల ఆజ్ఞలు పాలించేవాడు స్వయంసేవక్ అన్న భావనకు వారెప్పుడూ చోటు కల్పించలేదు. అంతేకాదు సంఘ స్వయంసేవకుల పట్ల ఇతరులు ఇలాంటి భావాన్ని కలిగి ఉండే అవకాశం యివ్వలేదు కూడా. స్వయంసేవక్ అంటే ఒక గౌరవప్రదమైన భావన కలిగేరీతిలో అందరూ ఆలోచించేట్లు కృషి చేశారు. ఎవరైనా 'ఏదోకాస్త పని ఉంది స్వయం సేవకులను పంపించండి' అంటూ పని పురమాయించాలనుకుంటే ససేమిరా ఒప్పుకొనే వారు కాదు డాక్టర్‌జీ. సేవలు అందిస్తే డబ్బు ఇస్తామన్న వాళ్ళు కూడ ఎందరో ఉన్నారు.

## సంఘం అంటే నిస్వార్థపరుల సంఘటనే

సంఘం అనే మాటనుకూడ ఇష్టం వచ్చినట్లు వాడడం జరుగుతోంది. 'వర్తక సంఘం', 'హరిజనసేవాసంఘం' ఇత్యాది మాటలు మనం వింటూనే ఉంటాం. సమాజంలో ఏదో ఒక ప్రత్యేక వర్గానికి సంబంధించిన వ్యక్తులు కలసి ఒక సంఘాన్ని ఏర్పాటు చేసుకొంటారు. ఆ వర్గానికి సంబంధించిన అవసరాలు తీర్చుకోవడం కోసం ఇలాంటి సంఘాలు పనిచేస్తుంటాయి. కాని 'సంఘం' అనే శబ్దాన్ని కేవలం జాతి హితాన్ని కోరుతూ క్రమశిక్షణాయుతంగా పనిచేసే నిస్వార్థ వ్యక్తుల సంఘటనను దృష్టిలో ఉంచుకొని డాక్టర్‌జీ ప్రయోగించారు. ఈరోజు ఈ పదం ఎంత ప్రాచుర్యం పొందిందంటే సంఘం అనగానే రాష్ట్రీయ స్వయంసేవక సంఘమే అందరి దృష్టిలో

కనిపిస్తోంది. ఒక వర్గానికో, కులానికో, వృత్తికి సంబంధించిన వ్యక్తులకో చెందిన సంస్థ కావచ్చునని ఎవరూ అనుకోరు. జాతీయధ్యేయంతో ఒకేరకంగా ప్రేరితులైన వ్యక్తుల సంఘటననే సంఘం అనాలని డాక్టర్‌జీ మొదటినుండీ స్పష్టపరిచారు. అందుచేతనే సంఘం అనగానే సమస్త హిందూ సమాజాన్ని కలుపుకొని యావత్‌దేశాన్ని ఆవరించి యున్న హిందూ శక్తి అన్న అర్థమే వస్తోంది.

హిందూ రాష్ట్రానికి స్వాతంత్ర్యాన్ని సమకూర్చి, హిందూ ధర్మాన్ని హిందూ సంస్కృతిని రక్షించి, హిందూ రాష్ట్రానికి పరమ వైభవస్థితిని సమకూర్చే ఉద్దేశ్యంతో డాక్టర్‌జీ సంఘాన్ని స్థాపించారు. సంఘ ప్రారంభంలో నియమావళికాని ఎలాంటి నిబంధనలు కానీ, పదవులుకానీ లేవు. నిధికి సంబంధించిన ఏర్పాటు కూడా లేదు. వ్యవస్థిత రూపంలో కార్యాలయాల గూర్చిగాని, కాగితాలనుగూర్చిగాని వారు ఆలోచించలేదు. ఎందుచేతనంటే వారు వీటన్నింటికంటే మనిషికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. ఆ మనుషులను ఉన్నత సంస్కారాలతో తీర్చిదిద్దడంపైన ఎక్కువ శ్రద్ధ వహించారు. స్వయంప్రతిభతోనూ, 10-15 సంవత్సరాల ప్రజాజీవనంలో గడించిన అనుభవంతోనూ అత్యంత విశిష్టమైన అద్భుత కార్యపద్ధతిని వికసింపజేశారు.

## విలక్షణమైన కార్యపద్ధతి

'హిందూరాష్ట్రం' అన్న ఆలోచన ప్రప్రథమంగా డాక్టర్‌జీ ప్రతిపాదించినది కాకపోయినా, హిందూ సంఘటన కొరకు నిర్మాణమైన అమూల్యమూ, అపూర్వమూ అయిన ఈ కార్యపద్ధతి మాత్రం వారు ప్రసాదించినదే. హిందూ రాష్ట్ర భావనలోని వాస్తవికతను అందరికీ అర్థం అయ్యేటట్లు విశదపరిచే వారు డాక్టర్‌జీ. వాదోపవాదాలతో సమయం వృథా చేయకుండా వ్యక్తులను సంఘటితపరచి సంస్కారవంతులుగా చేయడం పట్లనే వారు దృష్టిని కేంద్రీకరించేవారు.

డాక్టర్‌జీ ప్రసాదించిన ఈ విశిష్టమైన కార్యపద్ధతిలో అతిముఖ్యమైన విషయం ప్రతినిత్యం క్రమం తప్పకుండా జరిగే సంఘశాఖ. అయితే ప్రారంభ దినాలలో నిత్యశాఖ అనేదిలేదు. ఆ రోజుల్లో ముఖ్యంగా సమావేశాల రూపంలోనే సభ్యులందరూ కలుసుకొంటుండేవారు. శారీరక శిక్షణ కొరకు వాళ్ళు ఏదో ఒక వ్యాయామశాలకు పోతూండేవారు. తర్వాత కొన్నాళ్ళకు నాగపూర్‌లోని మహాల్ ప్రాంతంలో నిత్య సంఘశాఖ ప్రారంభించబడింది. సంఘశాఖద్వారా బాలురు, యువకులు, ప్రౌఢ వయస్కులను ఒకచోట కలిపి వారికి సంస్కారాలు అందించడం పట్ల డాక్టర్‌జీ ఎక్కువ శ్రద్ధ చూపేవారు. అన్నిచోట్లకు సంఘశాఖలను విస్తరింప చేసేందుకు వారు నిరంతర ప్రయత్నం కొనసాగించారు. సంఘస్థాపన తర్వాత వారు జీవించిన పదిహేనేండ్లలో విదర్భ మహారాష్ట్ర ప్రాంతాలలోనేగాక భారతదేశంలోని

అనేక ప్రాంతాలకు నాగపూర్‌లో శిక్షణపొందిన కార్యకర్తలు వెళ్లారు. సంఘబీజాలను నాటారు. 1940 సంఘ శిక్షావర్గ (శిక్షణ శిబిరం)లో పంజాబు, సింధు, ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్, బీహార్, మహారాష్ట్ర, రాజస్థాన్, గుజరాత్, కర్నాటక, బెంగాల్, మద్రాసు మొదలైన ప్రాంతాలనుండి స్వయంసేవకులు పాల్గొన్నారు. ఈ స్వయంసేవకులను ఉద్దేశించి 1940 జూన్ 9న వ్యాధితో బాధపడుతూ ఇచ్చిన వీడ్కోలు ఉపన్యాసం డాక్టర్‌జీ యొక్క అంతిమ ప్రసంగం అయింది. ఆ ప్రసంగంలో 'నా కళ్ళముందు హిందూ రాష్ట్రంయొక్క సంగ్రహ రూపాన్ని చూస్తున్నాను' అంటూ అర్థవంతంగా చెప్పారు. ఈ వాక్యంలోని అంతరార్థం 1940 వరకూ సాగిన కృషి కారణంగా దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ సంఘశాఖలు ప్రారంభించామని చెప్పటమే. ప్రాంతం, భాష, కులం, మతశాఖల పేరుతో సృష్టించబడుతున్న భేదాలను పటాపంచలు చేసి కేవలం హిందుత్వ భావన ఆధారంగా సంఘటన నిర్మాణం చెయ్యాలని డాక్టర్‌జీకి ఉన్న ఉదాత్తమైన జాతీయ సంకల్పం రూపుకట్టే మార్గం ఆనాడు సాక్షాత్కరించింది. సంఘమంత్రాన్ని సంఘతంత్రాన్ని దీక్షతో పాటించి నట్లయితే కార్యసిద్ధి తప్పక జరుగుతుందనే విశ్వాసం నిర్మాణం చేయడంలో డాక్టర్‌జీ సఫలీకృతులైనారు. హిందూరాష్ట్ర మంత్రంతోపాటుగా అత్యంత ప్రభావశాలియైన తంత్రం మనకందించి దాని వికాసానికి నిరంతరం కృషి చేశారు డాక్టర్‌జీ.

ఆ సంఘతంత్రంలో ప్రప్రథమంగా పేర్కొనదగిన విశిష్టత దైనందిన శాఖ. శాఖకు నియమిత రూపంలో స్వయంసేవకులు హాజరై శారీరక, బౌద్ధిక కార్యక్రమాల ద్వారా ధ్యేయనిష్ఠ, క్రమశిక్షణలతో పనిచేసే సంస్కారం పొందుతారు. శాఖా కార్యక్రమాలలో యోగచాప్ (లెజిమ్) అభ్యాసం చేయడంలోనూ, దండ (లాఠీ) ప్రయోగించడంలోనూ, ఛురిక, వేత్రచర్మవంటి పౌరుష ప్రధానమైన క్రీడలలోను, కబడ్డీ వంటి ఉత్తేజాన్ని కలిగించే ఆటలలోను, సమత (డ్రిల్) మొదలైన కవాతు శిక్షణలోనూ, దేశభక్తి గీతాలు పాడుకోవడంలోనూ, వీరగాథలు చెప్పుకోవడంలోనూ ఉత్సాహంగా కాలం గడుపుతారు. దేశము, ధర్మము, సంస్కృతి పట్ల నిష్ఠను పెంచి, సంఘ సిద్ధాంతము, కార్యపద్ధతి పట్ల దృఢవిశ్వాసాన్ని కలిగించే ప్రసంగాలు జరుగుతాయి. గణవేషం (యూనిఫారం) కూడా నిశ్చయించబడింది. ఆ తర్వాత ఘోష్ (బ్యాండ్) వాద్యాల తాళంతో కాలు కలుపుతూ గణవేషధారులైన స్వయంసేవకులు కవాతు ప్రదర్శించడం ప్రారంభమైంది. శిబిరాలు నిర్వహించడం మొదలైంది. వ్యక్తులు ఒకచోట చేరితే కార్యక్రమాలు అవసరం అవుతాయి. కార్యక్రమాలు జరుగుతూ ఉంటే వ్యక్తులు ఆకర్షించబడుతూ ఉంటారు. గుణ నిర్మాణానికి కార్యక్రమాలు తోడ్పడతాయి.

### సంఘం అంటే శాఖ :

బయటినుంచి చూచేవారికి సంఘం అంటే దండ (లాఠీ) ప్రయోగాలు, కవాతు ప్రదర్శనలు, ప్రసంగాలు, చర్చలు మాత్రమే అని అనిపించవచ్చు. కాని సంఘం వ్యాయామశాలకాదనీ, అర్ధసైనిక (పేరామిలిటరీ) దళంకాదని, చర్చావేదిక కూడా కాదనీ, హిందూ సమాజాన్ని సంఘటిత పరిచే కార్యమనీ స్వయంసేవకులకు తెలుసు. హిందూరాష్ట్రమనే ధ్యేయాన్ని ముందుంచుకొని ప్రేరితులై క్రమశిక్షణా యుతంగా కార్యనిర్వహణ చేసేవారిని ఒకచోట చేర్చడమే సంఘ ఉద్దేశం. ఈ కలయిక సంఘకార్యానికి ఆత్మ. కార్యక్రమాలు శరీరసదృశమైన సాధనోపకరణం మాత్రమే. సాధనమార్గాలు మారవచ్చు. కాని ఆత్మ శాశ్వతమైనది. ఈరకమైన అవగాహన స్వయంసేవకులలో నిలిపేందుకు డాక్టర్‌జీ ప్రత్యేక శ్రద్ధ వహించారు. వ్యక్తి తన జీవితంలో సంఘకార్యంకోసం - అంటే దేశకార్యం లేక సామాజిక కార్యం కోసం తప్పకుండా కనీసం ఒక గంట సమయం ఇచ్చే అలవాటు చేసుకోవాలి. ఆ గంటసేపు మిగతా ఆలోచనలు ప్రక్కన పెట్టేందుకు కావలసిన మానసిక సంసిద్ధత నిర్మాణం కావాలి. సంఘానికి రావడంవల్ల నాకు కలిగే లాభం ఏమిటన్న ఆలోచన బుర్రలోనుంచి తొలగించాలి. ఎవరికి వారు తమ స్వయంసేవకత్వానికి సార్థకత చేకూర్చడం ఎలా అన్న ఆలోచన చేయాలి - దైనందిన శాఖకు హాజరు కావాలనడంలో ఉద్దేశ్యం యిదీ !

### గురువు - గురుదక్షిణ :

డాక్టర్‌జీ స్వయంసేవకులకు భగవాధ్వజమే మన గురువు అని స్పష్టంగా తెలియజేశారు. గురుపౌర్ణిమ రోజున గురువును పూజించి గురుదక్షిణ సమర్పించా లన్నారు. భారతదేశంలో గురుపూజ పరంపరానుగతంగా వస్తున్నదే. ఏదో ఒక వ్యక్తిని గురువుగా స్వీకరించకుండా మన సంస్కృతికి ప్రతీకమైన భగవాధ్వజాన్ని గురువుగా స్వీకరించ మనడంలో డాక్టర్‌జీలోని విశేష ప్రతిభ మనకు సుబోధితమౌతుంది. ఈ పద్ధతి వలన వ్యక్తి పూజకు ఆస్కారం లేకుండా పోతుంది. సంఘకార్యానికి స్వావలంబన సిద్ధిస్తుంది. ధనవంతులుగాని, కీర్తిదాహం గలవారుగాని సంఘాన్ని తమ చెప్పుచేతలలో పెట్టుకునే ప్రమాదం లేకుండా పోతుంది. అంతేకాదు సంఘ కార్యంపట్ల అత్యధిక సమర్పణ భావం స్వయంసేవకులలో అభివృద్ధి చెందడానికి కూడ ఈ పద్ధతి తోడ్పడింది.

అలాగే తమ గణవేషం (యూనిఫారం) స్వంతడబ్బుతోనే సమకూర్చు కోవడం, సంఘశిబిరాలలో శిబిరరుసుము (నిర్వహణ ఖర్చులు) స్వయంగా

చెల్లించడం, రాకపోకల ఖర్చులు భరించుకోవడం మొదలైన పద్ధతులన్నీ దేశకార్యం నిర్వహించడం మన కర్తవ్యం అనే భావనను అలవర్చడం కోసం ఏర్పరచినవే. సంఘంకోసం తను మన ధన రూపంలో ఎప్పుడు ఏది అవసరమైతే అది, ఇతరులను దేబిరించకుండా, స్వయంగా సమకూర్చుకునే సంసిద్ధత స్వయంసేవకులలో ఉండాలి. గత 63 సంవత్సరాలుగా రాష్ట్రీయ స్వయంసేవక సంఘం ఎవరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడకుండా పెరుగుతూ పోవడానికి ఈ విధానమే కారణం. తన స్వంతంత్రాన్ని ఇతరులకు కుదువపెట్టకుండా సంఘం పని చేసుకుపోగలగడానికి కారణం ఇదే. దేశంలో ఎలాంటి యిబ్బందులు వచ్చినా సంఘ స్వయంసేవకులు తను మన ధన పూర్వకంగా సేవచేయడానికి ఎప్పుడూ వెనుకాడలేదు.

## చైతన్యవంతమైన కార్యపద్ధతి :

సంఘ కార్యపద్ధతి వికసిస్తూ పోతున్న కొద్దీ అనేక విషయాలు జోడింప బడుతూ వచ్చాయి. విజయదశమి, సంక్రాంతి, ఉగాది, గురుపౌర్ణిమ, రక్షాబంధన్ వంటి మన పండుగలు శాఖలలో జరపాలని డాక్టర్‌జీ చెప్పారు. పరంపరానుగతంగా వస్తున్న ఈ పండుగలకు సమాజపరమైన అర్థం కలిపించి వీటిని జన సంపర్కానికి సాధనాలుగా మార్చారు. ఈ అయిదు ఉత్సవాలకు తోడు ఛత్రపతి శివాజీ పట్టాభిషేకం జరిగిన రోజును 'హిందూ సామ్రాజ్య దినోత్సవం'గా జరపాలని జోడించారు.

అంతకుముందు శివాజీ జయంతి ఉత్సవాలను లోకమాన్య తిలక్ సమాజంలో జాగృతిని కలిగించటానికి సాధనంగా ప్రారంభించారు. డాక్టర్‌జీ శివాజీ పట్టాభిషేక దినోత్సవానికి హిందూ సామ్రాజ్య దినోత్సవం అనే పేరుపెట్టి తనకుగల జాతీయ లక్ష్యాన్ని విస్పష్టంగా తెలియజేశారు. శివాజీమహారాజు హైందవీ స్వరాజ్య సింహాసనాన్ని ప్రతిష్ఠించారు. ప్రాచీనకాలంనుంచీ ఇది హిందువుల దేశంగా ఉంటూ వస్తున్నది, ఇక్కడి హిందూజీవనాన్ని ఆధారంగా చేసుకొనే మన జాతీయ జీవనానికి పరిపుష్టిని చేకూర్చాలి, దీనిపైన దురాక్రమణ చేసి దెబ్బతీయాలనే సాహసం ఎవ్వరికీ రావడానికి వీల్లేదు - స్వరాజ్యానికి అర్థం యిదే. ప్రపంచ దేశాలపైన హైందవ సంస్కృతి యొక్క ప్రభావం ప్రసరించాలనీ, ఆ సమాజాలు ఉన్నతమైన హైందవ మానవతా విలువలను అనుసరించాలనీ అనేదే హిందూ సామ్రాజ్య భావన. అంతేకాని భౌతికవాద సామ్రాజ్యాలవలె ఇతరులను పీడించి, దోపిడిచేసి, బానిసలుగా మార్చడం కాదు. హిందూ సామ్రాజ్య దినోత్సవాన్ని జరుపుతూ

ఉండాలనడంలో డాక్టర్‌జీ అభీష్టం యిదే. భారతదేశం యొక్క జాతీయలక్ష్యం యిదే.

సంస్కారాలు అందించడంలో ప్రార్థన, ప్రతిజ్ఞ - రెండూ మహత్తరమైన ప్రాముఖ్యం కలిగియున్నాయన్న సంగతి డాక్టర్‌జీకి తెలుసు. అందుకనే కార్యపద్ధతిలో ఈ రెంటికీ స్థానం కల్పించారు. 1928 మార్చి మాసంలో నాగపూరు వెలుపల ప్రశాంతమైన స్థలంలో మొట్టమొదటిసారిగా 99 మంది స్వయంసేవకులు ప్రతిజ్ఞ తీసు కొన్నారు. ఈ విధంగా ప్రతిజ్ఞ తీసుకొన్న మొదటి జట్టులో అధికభాగం తమ జీవితాంతం అక్షరాల ప్రతిజ్ఞను పాటించినవారే. ఆ జట్టులో ఇంకా జీవించియున్న కొద్దిమంది యిప్పటికీ సంఘకార్యంలో నిమగ్నమై యున్నారు.

ప్రారంభ దినాల్లో సంఘప్రార్థన కొంత హిందీలోను, కొంత మరాఠీలోను ఉండేది. మహారాష్ట్ర ప్రాంతానికి వెలువలకూడా ఇదే ప్రార్థన అమలులో ఉండేది. అయితే సంఘకార్యం అనేక ప్రాంతాలలో విస్తరిస్తూ పోతున్నప్పుడు దేశవ్యాప్తంగా వున్న స్వయంసేవకులు సంఘభావాలను అర్థం చేసుకొంటూ ధ్యేయాన్ని అనునిత్యం స్మరించుకొంటూ ఉండేవిధంగా, సహజరీతిలో ఉచ్చరించేందుకు వీలుగా ప్రార్థనను తయారుచేయాలని డాక్టర్‌జీ భావించారు. అంతేకాకుండా ఏ సంప్రదాయానికి చెందిన వారైనా సంకోచించకుండా ప్రార్థన చేసేందుకు వీలుగా కూడా తయారుచేయాలనుకొని 1939లో నాగపూర్‌కు 30 మైళ్ల దూరంలో ఉన్న సిందీ గ్రామంలో ప్రముఖ కార్యకర్తల సమావేశాలు జరిగినప్పుడు ప్రార్థనతోపాటు కార్యపద్ధతికి సంబంధించిన అనేక విషయాలు కూలంకషంగా ఆలోచించడం జరిగింది. ఆ సమావేశాల తర్వాతనే సంస్కృత ప్రార్థన, సంస్కృత ఆజ్ఞలు అమలులోకి వచ్చాయి.

సంఘకార్యపద్ధతి అతి సరళమైనది. ఎంత సరళమైనదంటే పెద్దలు - పిన్నలు, అక్షరాస్యులు - నిరక్షరాస్యులు, ధనికులు - పేదలు అందరూ ఈ కార్యపద్ధతిలో సమానంగా పనిచేయగలుగుతారు. ఇంత సరళమైన కార్యపద్ధతి చూసి అసలు దీనిద్వారా మనం ఏమైనా సాధించగల్గుతామా అన్న అనుమానం కొందరికి రావచ్చు. కాని ఈ కార్యపద్ధతి మంచి ఫలితాలనిచ్చే సత్తా కలిగి ఉన్నదన్న సంగతి కాలక్రమంలో ఋజువైంది. ఈ కార్యపద్ధతి ద్వారానే సమాజంలో అతిసామాన్య వ్యక్తులలో నుండి అసాధారణ కార్యాలు సాధించగల వేలాదిమంది స్వయంసేవకులు తయారైనారు.

## సంఘ అంతరంగం:

సంఘకార్యపద్ధతి ద్వారా సంఘశాఖలలో స్పష్టంగా కనిపించే ఫలితమిది. డాక్టర్‌జీ స్వయంగా తాను ఆచరించి చూపడమే కాక బాల, తరుణ స్వయంసేవకులందరూ సహజంగా ఆచరించిన ఈ కార్యపద్ధతిలో ఇంకా అనేక విశేషాలున్నాయి. ఈ కార్యపద్ధతి సక్రమంగా అమలుచేయడం ద్వారానే సంఘశాఖ చైతన్యవంతంగా కళకళ లాడుతూ వృద్ధి చెందగలుగుతోంది. సంఘకార్యపద్ధతిలో ఇమిడి ఉన్న విషయాలలో అత్యంత మహత్వపూర్ణమైనది సంఘ స్వయంసేవకుల మధ్య ప్రేమ, ఆత్మీయత, విశ్వాసాలతో కూడిన కుటుంబ వాతావరణ నిర్మాణం. వారి ఇళ్ళకు వీరు, వీరి ఇళ్ళకు వారు వస్తూపోతూ ఉండడం, సహజధోరణిలో పరస్పరం కలుసుకొంటూ ఉండటం జరుగుతూ ఉంటుంది. సంఘకార్యాన్ని విస్తరింప చేయడానికి ఆలోచనలు చేయడం, శాఖకు వచ్చేవారెవరు నియమోల్లంఘన చేయడంకాని, బద్ధకంతో పని మానివేయడం కానీ జరుగకుండా చూడడం, ఏవైనా బాధలు వస్తే ఒకరికొకరు సహాయ పడడం - ఇలా అనేక విధాలుగా పనిచేసి పటిష్టమైన సంఘటన నిర్మిం చేందుకు డాక్టర్‌జీ స్వయంగా అనేకమంది స్వయంసేవకుల ఇండ్లకు వెళ్ళి మాట్లాడుతూ ఆ కుటుంబాలలో తాము కూడా ఒక సభ్యుడా అన్నట్లు మసలుతుండే వారు.

స్వయంసేవకులు ఎప్పటికప్పుడు క్రొత్తవారిని స్నేహితులుగా చేసికొంటూ వారిని సంఘశాఖకు తీసుకు వస్తూండాలని డాక్టర్‌జీ తరచు చెప్పేవారు. నాగపూర్‌లో డాక్టర్‌జీ ఇంటిపైన ఉన్న గది తలుపులు స్వయంసేవకులు స్వేచ్ఛగా వచ్చి పోయేందుకు వీలుగా ఎప్పుడూ తెరిచిపెట్టి ఉండేవి. 14-20 సంవత్సరాల మధ్య వయసు ఉన్న యువకులను చుట్టూ చేర్చుకొని మాట్లాడుతూ డాక్టర్‌జీ సామాజిక జీవనంలో తమకు కలిగిన అనుభవాలు ఎన్నో వారికి చెపుతుండేవారు. గంటల తరబడి పిచ్చాపాటి సాగుతుంటే అంతా కదలకుండా అక్కడే కూర్చుని ఉండేవారు. ఇలాంటి సమావేశాల ద్వారానే డాక్టర్‌జీ సంఘసంస్కారాలను అందిస్తుండేవారు. ఉచి తానుచితాల కొలతబద్ద ఏమిటో స్వయంసేవకులకు ఎరుకపరుస్తూ వారిలో తీవ్రమైన ధ్యేయ నిష్ఠను నింపేవారు. స్వయంసేవకులలో పరస్పర స్నేహభావం పెంచే వారు.

## ఇలా ఉండాలి నాయకుడంటే:

స్వయంసేవకులలో డాక్టర్‌జీ నెలకొల్పిన సమరసభావం అత్యద్భుత మైనది. ఇతరచోట్ల నాయకులకు, అనుయాయులకు మధ్య కనిపించే దూరం మచ్చుకైనా లేకుండా చేశారు డాక్టర్‌జీ - తమ సంఘటనా కౌశలంతో.

డాక్టర్‌జీ అంటే స్వయంసేవకులకు అపారమైన ఆకర్షణ ఉండేది. అంతకు మించిన ఆదరభావం ఉండేది. వారి పర్యటనలలో కూడా ఇలాంటి సమావేశాలు రాత్రి పూట ఎక్కువగా జరుగుతుండేవి. కాబట్టి డాక్టర్‌జీకి విశ్రాంతి లభించేది కాదు. సంఘ కార్యం ప్రారంభించిన తర్వాత విశ్రాంతి అనే భావన డాక్టర్‌జీ తన మనస్సులోంచి తొలగించారు. సంఘ కార్యాభివృద్ధి కొరకై జీవితమంతా వెచ్చించారు. సంఘ కార్యానికి తమ జీవితాన్ని సమర్పణ చేసుకొన్నారు. వ్యక్తిగత జీవితానికి సంబంధించిన కష్టాలకు, సమస్యలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. అసలు వాటిని గూర్చి పట్టించుకోనేలేదు. డాక్టర్‌జీ తమ ప్రతి కదలికలోనూ ఆచరించి చూపిన ఆదర్శజీవితం వారి పరిచయంలోకి వచ్చిన స్వయంసేవకులు సంఘకార్యపద్ధతిని సరిగా అవగాహన చేసికొనేందుకు తోడ్పడేది.

సంఘకార్యం ప్రారంభించి కార్యవిస్తరణకు కృషి చేస్తున్నప్పుడు అకారణంగా ఎవరినీ శత్రువులుగా చేసికోకుండా మెలకువ వహించే వారు డాక్టర్‌జీ. ఉత్తర ప్రత్యుత్తరాలలో ఇతరులు దురుపయోగం చేయడానికి వీలైన మాటగాని, అవతలి వారి మనస్సుకు బాధ కల్గించే మాటగాని ఉండకుండా జాగ్రత్తపడేవారు.

## *నేతాజీతో సమాగమం :*

విప్లవకారులతోగాని వారి కార్యక్రమాలతోగాని సంబంధాలు ఉన్నవారిని ప్రభుత్వం వక్రబుద్ధితో చూస్తుండేది కనుక డాక్టర్‌జీ సంఘాన్ని కళ్లల్లో వత్తులు వేసికొని కాపాడుతుండేవారు. అయితే దేశభక్తి ప్రపూరితులై ప్రాణాలకు లెక్కచేయక భారతమాత దాస్య శృంఖలాలు ఛేదించడానికి సాయుధ పోరాటాలకు తలపడిన వీరుల పట్ల డాక్టర్‌జీకి చాల ఆదరభావం ఉండేది. అవకాశం చిక్కినప్పుడెల్లా ఈ దేశభక్తులకు సహాయపడుతుండేవారు. నేతాజీ సుభాష్ చంద్రబోసును 1928లో కలకత్తా కాంగ్రెస్ జరిగినప్పుడే డాక్టర్‌జీ కలుసుకొన్నారు. డాక్టర్‌జీ తలపెట్టిన హిందూ సంఘటన కార్యం ఆయనకు నచ్చింది. ఆ తర్వాత ప్రత్యక్షంగా డాక్టర్‌జీ కొనసాగిస్తున్న సంఘకార్యం చూసి ప్రభావితులైనారు. అది తన సహకారం అందచేయదగిన కార్యమని కూడా వారు భావించారు. నాసిక్ సమీపంలో నున్న దేవలాలీలో డాక్టర్‌జీ అనారోగ్యంతో చికిత్స పొందుతున్నప్పుడొకసారి, ఆ తర్వాత నాగపూర్‌లో ఆరోగ్యం పూర్తిగా క్షీణించి, చనిపోయే ముందురోజు ఒకసారి వారితో కలిసి సంప్రదించడానికి నేతాజీ వచ్చారు. కాని రెండుసార్లు అది కుదరలేదు. శహీద్ భగత్‌సింగ్ కూడా డాక్టర్‌జీని కలిశారు. భగత్‌సింగ్ సహచరుడైన రాజగురు అజ్ఞాతంలో ఉండగా డాక్టర్‌జీ




ఆయనను కొన్నిరోజులపాటు సురక్షితంగా ఉమరేడ్‌లోని భయ్యాజీ దాణీగారి ఇంటిలో రహస్యంగా ఉంచారు.

సంఘభావన అంకురించినది మొదలు కార్యపద్ధతి నిర్ణయమయ్యేవరకు అన్ని దశలలోను డాక్టర్‌జీయే ఎంతో శ్రమకోర్చి కత్తిమీద సాములవలె కార్యభారాన్ని నిర్వహించారు. వారి పరిశ్రమ చేత స్వయంసిద్ధమైన నేతృత్వం వారికి దక్కింది. సంఘం పెరుగుతూ పోతున్న కొద్దీ ఆకార్యాన్ని సూత్రబద్ధం చేసి నిర్వహించేందుకు సర్వోన్నతమైన ఒక పదవిని ఏర్పరచాలని 1929, నవంబరు 9, 10 తేదీలలో నాగపూర్‌లో జరిగిన సంఘచాలకులు, ముఖ్యకార్యకర్తల సమావేశాలలో మొదటి రోజున కార్యకర్తలు ఆలోచించారు. ఆ పదవిలో డాక్టర్‌జీని అధివసింపజేయాలని కూడా భావించారు. ఇకపైన డాక్టర్‌జీని 'సర్ సంఘచాలక్' గా భావించాలని నిర్ణయించారు. ఆనిర్ణయానికి అనుగుణంగా సమావేశాల రెండవ రోజున అనగా 1929 నవంబరు 10 సాయింత్రం సంఘస్థాన్‌లో అప్పాజీజోషి సర్ సంఘచాలక్ ప్రణామ్ చెప్పారు. దేశంలో ఉన్న శాఖలన్నీ వారి మార్గదర్శనంలోనే నడవాలని సూచనలు పంపారు. సహచరులిచ్చిన ఈ సూచనను డాక్టర్‌జీ అయిష్టంగానే అంగీకరించారు.

డాక్టర్‌జీ అనేక సంస్థలలో పని చేశారు కాని ఎక్కడా పదవులు కావాలనీ, కీర్తి కావాలనీ కోరుకోలేదు. "నేను సంఘాన్ని ప్రారంభించింది సంఘంపైన సర్వాధిపత్యం వహించడానికే" - అన్న భావన వారి మనస్సును ఎన్నడూ స్పృశించను కూడ లేదు. ఒక సామాన్య స్వయంసేవక్‌గా పని చేయడంలోనే వారికి ఎక్కువ ఆనందం లభించేది. సంఘంలో పని పదవి మీద ఆధారపడి ఉండదు. పదవీ బాధ్యతలు స్వీకరించడమంటే ఎక్కువ భారం మోయడానికి సిద్ధపడటం

అనే అర్థం. అందుకే సంఘంలో పదవులకోసం కొట్లాట కనిపించదు. పదవి లభిస్తే వ్యక్తిగత ప్రయోజనం ఏదీ చేకూరకపోగా సంఘంలో ఎంత ఉన్నత పదవి అయితే అంత ఎక్కువ పనిభారం మీద పడుతుంది. డాక్టర్‌జీ సర్‌సంఘచాలక్ బాధ్యత స్వీకరించాక నాలుగేండ్లకు వ్రాసిన ఒక చిన్న లేఖను వారి జీవిత చరిత్రలో శ్రీ నానా పాల్కర్ ఉటంకించారు. ఆ చిన్న లేఖలో వారి మనోభావాలు స్పష్టంగా తెలుస్తాయి.

"ఈ సంఘ ఆవిర్భావానికి మూలకారకుడను నేను కాదని, మీరేనని, నాకు బాగా తెలును. మీ ద్వారా ఆవిర్భవించిన ఈ సంఘ కార్యకలాపాలు నిర్వహించే బాధ్యత మీ అభీష్టం మేరకు, మీ ఆజ్ఞానుసారం నేను నెరవేరుస్తున్నాను. ఈ కార్యాన్ని ఎంతకాలం నిర్వహించాలని మీరు నన్ను ఆజ్ఞాపిస్తే అంతకాలం నిర్వహిస్తాను. ఈ కార్యనిర్వహణలో ఎంతకష్టాన్ని సహించ వలసి వచ్చినా, ఎన్ని అవమానాలు భరింపవలసి వచ్చినా వెనకడుగు వేయక కొనసాగిస్తాను. కాని నేను ఈ కార్యనిర్వహణకు అసమర్థుడనని భావించినా, నా కారణంగా సంఘానికి ఏమాత్రం హాని జరుగుతోందని భావించినా, నా స్థానంలో సమర్థుడైన మరొక వ్యక్తిని మీరు ఎంపిక చేసికోవచ్చు. మీ ఆజ్ఞలు పాటించి నేను ఈ పదవిని ఎంత ఆనందంగా స్వీకరించానో, అంత ఆనందంగానే మీరు ఎంపిక చేసిన మరోవ్యక్తికి సర్వాధికారాలు అప్పగించి, ఆ క్షణం నుంచి స్వయంసేవకులందరి వలె వారి ఆజ్ఞానుసారం వ్యవహరిస్తాను. గొప్పదనం వ్యక్తిది కాదని, సంఘకార్యానిదని నేను భావిస్తాను. సంఘానికి మేలు జరుగుతుందంటే ఎట్లాంటి పని నిర్వహించ వలసి వచ్చినా, అవమానకరంగా భావించను." అని వ్రాశారు డాక్టర్‌జీ.

## *సత్యాగ్రహం, జైలు శిక్ష:*

సంఘ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని సర్‌సంఘ్‌చాలక్ పదవీ బాధ్యతలు మరొకరికి అప్పగించే అవసరం కూడా వారికి ఒకసారి ఏర్పడింది. 1930లో మహాత్మా గాంధీ సత్యాగ్రహోద్యమం జరుపుతున్న రోజులవి. ఆందోళనలో భాగంగా ప్రజలంతా ప్రభుత్వశాసనాలను ఉల్లంఘించ వలసిందని మహాత్మా గాంధీ కోరారు. మహాత్మాజీ స్వయంగా దండి యాత్ర ద్వారా సత్యాగ్రహం ప్రారంభించారు. సంఘం ఈ సత్యాగ్రహాలలో పాల్గొనదు కాని వ్యక్తిగతంగా స్వయంసేవకులెవరైనా పాల్గొన దలచు కొంటే వారికి అభ్యంతరం చెప్పదని డాక్టర్‌జీ అన్ని చోట్లకు సూచనలు పంపారు. అంటే సంఘంలో బాధ్యతగల స్వయంసేవకులు మాత్రం సత్యాగ్రహాలలో పాల్గొనరని విశదపరచారు. డాక్టర్‌జీ వ్యక్తిగతంగా సత్యాగ్రహంలో పాల్గొనాలని

నిర్ణయించుకున్నారు. కాంగ్రెస్‌తో భేదాభిప్రాయాలు వచ్చినప్పటికీ స్వాతంత్ర్య పోరాటానికి దూరంగా ఉండటం ఇష్టంలేకపోవడమే అందుకు కారణం. కాంగ్రెస్ నిర్వహించిన ఆందోళనలో లోగడ ఒకసారి పాల్గొని జైలు శిక్షను అనుభవించారు కూడ. వ్యక్తిగత హెూదాలో సత్యాగ్రహంలో పాల్గొనేందుకు వీలుగా డాక్టర్‌జీ కొద్దికాలంపాటు సర్‌సంఘచాలక్ బాధ్యతలన్నింటినీ డా॥ ఎల్.వి. పరంజపే గారికి అప్పగించారు. 1930 జూలై 4న యవత్‌మాల్ దగ్గర అటవీ సత్యాగ్రహంలో




పాల్గొన్నారు. ఈ సత్యాగ్రహాన్ని తిలకించడానికి పదివేలమందికి పైగా ప్రజలు అక్కడికి చేరారు. పోలీసులు డాక్టర్‌జీని, వారి సహచరులను అరెస్టు చేసి కేసునడిపి 9 మాసాల కారాగారవాస శిక్షను విధించారు. వారిని అకోలా జైలులో నిర్బంధించారు.

తాను జైలులో ఉన్నకాలంలో సంఘకార్యం ఎవరు చూస్తారన్న చింత వారికి కలుగలేదు. అయిదు సంవత్సరాలపాటు అహెూరాత్రులూ శ్రమించి పనిచేసి నిర్మాణం చేసిన తరుణకార్యకర్తల బృందం యొక్క సమర్థతపైన వారికి పరిపూర్ణ విశ్వాసముంది. ఈ సత్యాగ్రహంలో పాల్గొనేందుకు వెళ్లేముందు జరిగిన వీడ్కోలు సభలో ఇలాంటి ఉద్యమాల పట్ల ఎలాంటి అవగాహన ఉండాలో స్వయంసేవకులకు స్పష్టంగా వివరించారు డాక్టర్‌జీ. అందులోని ముఖ్యాంశాలు రెండు:

మొదటిది: దేశంలో ఎలాంటి నూతన పరిణామాలు సంభవించినా ఆ పరిణామాలను జాతీయ ప్రయోజనాలకు అనుగుణంగా మలచుకోవాలి.

రెండవది: జైలుకు వెళ్లడ మొక్కటే దేశభక్తికి నిదర్శనం కాదు. దేశభక్తి అనేది ప్రదర్శన కోసంకాదు. అవసరమైతే ప్రాణాలు త్యజించడానికి కూడ సిద్ధపడాలి. ఇలాంటి కర్తృత్వ శక్తివల్లనే దేశానికి స్వాతంత్ర్యం లభిస్తుంది.

## జైలులోనూ సంఘంపని:

స్వయంగా డాక్టర్‌జీ తన జీవితంలో ఈ రెండు సూత్రాలు ఆచరించి చూపారు. ఎలాంటి క్లిష్టపరిస్థితులలోనూ వారిదేశభక్తి నీరసించ లేదు. తాత్కాలికమైన వైఫల్యాలు వారినెపుడు నిరాశాపూరితులుగాను, అకర్మణ్యులుగానూ చేయలేదు. డాక్టర్‌జీ కారాగారంలో నున్న తొమ్మిది నెలలలో కార్యకర్తలు అత్యంత దీక్షతో పనిచేసి సంఘకార్యాన్ని నిరంతరం వ్యాపింపజేశారు. జైలులో ఉన్న డాక్టర్‌జీకి ఎప్పటికప్పుడు సంఘ కార్యాభివృద్ధి నివేదికలు అందుతూనే ఉండేవి. కారాగారంలో ఉన్న సమయంలో ఒక్కక్షణం కూడా డాక్టర్‌జీ సంఘ ఆలోచనలను తన మస్తిష్కం నుంచి వీడిపోనీయలేదు. కారాగారంలో ఉన్న నాయకులతోనూ, కార్యకర్తలతోనూ డాక్టర్‌జీ సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొన్నారు. వారికి సంఘ కార్యాన్ని పరిచయం చేసేందుకు శ్రమించి కృతకృత్యులయ్యారు. అందువల్ల భవిష్యత్తులో సంఘకార్యాభి వృద్ధికి వారి సహకారంలభిస్తుందనే విశ్వాసం వారికి కలిగింది. తద్వారా కారాగారం నుంచి బయటికి రాగానే సంఘ కార్యవిస్తరణకు పెద్ద ఊపుతేగలిగారు.

విదర్భ ప్రాంతంలో విస్తృతంగా పర్యటించి, వివిధ కేంద్రాల్లో సంఘ శాఖలు స్థాపించి డాక్టర్‌జీ కార్యవేగాన్ని పెంచారు. 1932లో స్వాతంత్ర్యవీర సావర్కర్ అన్నగారు, ప్రముఖ విప్లవకారుడూనైన బాబారావు సావర్‌కర్‌తో కలిసి మహారాష్ట్ర ప్రాంతంలో పర్యటించి ముఖ్యకేంద్రాలన్నిటిలోనూ శాఖలు ప్రారంభించారు. ఆ సంవత్సరంలోనే వారు కరాచీలో జరిగిన హిందూయువక సమ్మేళనంలో పాల్గొన్నారు. అక్కడ హిందుత్వాన్ని అభిమానించే నాయకులు డాక్టర్‌జీని కలిశారు. ఈ సమ్మేళనంలో సర్వత్రా సంఘశాఖల స్థాపనకు అనుకూలత కన్పించింది.

మన సమాజం ఎదుర్కొంటున్న కష్టాలు నివారించుకొనే ఉద్దేశ్యంతో ప్రజలు హిందుత్వ భావనతో సమీకృతమయ్యే ప్రతిచోటకువెళ్లి వారితో మాట్లాడి, సంఘకార్యం అక్కడ ప్రారంభించ వలసిన ఆవశ్యకతను తెలియజెప్పడం డాక్టర్‌జీ కార్యపద్ధతిలోని ఒక విశేషత. హిందూమహాసభవారి సభలలోను, హిందూ యువక సమ్మేళనాలలోను పరిషత్తులలోను వారు ఈ ఉద్దేశ్యంతోనే పాల్గొనేవారు. ఇలాంటి కార్యక్రమాల ద్వారా

దేశంలోని వివిధ ప్రాంతాలలో అనేక మంది ప్రసిద్ధ వ్యక్తులను సంఘ సానుభూతి పరులుగా మార్చగలిగారు. తరుణ కార్యకర్తలు సంఘకార్య విస్తరణకై అనేక ప్రదేశాలకు వెళ్లినపుడు డాక్టర్‌జీ కృషివలన సంఘానికి సన్నిహితులైన అనేకమంది పెద్దల సహకారం వారికి లభిస్తూఉండేది. అందువల్ల సంఘ దైనందిన శాఖ ప్రారంభించడానికి వీలయ్యేది. డాక్టర్‌జీ నెరపిన ఉత్తర ప్రత్యుత్తరాలలో కూడా ఇలాంటి ఉదంతాలు ఎన్నో గోచరిస్తాయి.

మనుష్యులను కలపడానికి, పెద్దల మనస్సులలో సంఘం చోటు చేసి కొనేటట్లు చేయడానికి డాక్టర్‌జీ ఇంకో విధానం కూడా అవలంబించే వారు. ఎవరైనా పెద్దవారు నాగపూర్ వస్తే వారిని సంఘశాఖను దర్శించ వలసినదిగా డాక్టర్‌జీ ఆహ్వానించేవారు. మాటలలో చెపితే మనసుకెక్కని విషయాలెన్నో సంఘశాఖను ప్రత్యక్షంగా చూస్తే ఇట్టే అర్థం అయ్యేవి. విజ్ఞానకోశం రచించిన శ్రీధర వెంకటేశ కేత్కర్, విఠల్ భాయి పటేల్, పండిత మదన మోహన మాలవీయ, బారిస్టర్ తాత్యారావ్ సావర్‌కర్, నాటకకర్త ఖాదిల్‌కర్, సంత్ పాచలేగావ్‌కర్‌మహరాజ్ మొదలైన వారంతా శాఖను చూచి ముగ్ధులై ప్రశంసించిన వారే. సంఘ ఉత్సవాలకు, శిబిరాలకు ఆహ్వానించి డాక్టర్‌జీ ప్రభావితం చేసిన వ్యక్తుల జాబితా మరింత పెద్దదే అవుతుంది. వ్యక్తిగత సంపర్కం ద్వారానూ, సంఘశాఖలను ప్రత్యక్షంగా చూపడం ద్వారానూ సంఘ విస్తరణకు ఎక్కువగా కృషిచేసేవారు డాక్టర్‌జీ. అందుచేతనే సంఘం నిరంతరం అభివృద్ధి చెందుతూ చైతన్యవంతమైన సంఘటనగా రూపుదిద్దుకొంది.

## *సంఘము - కాంగ్రెసు :*

డాక్టర్‌జీ అనేక సంవత్సరాల పాటు కాంగ్రెస్‌లో ఉన్నారు. కాంగ్రెస్ మహాసభలలో పాల్గొన్నారు. కాంగ్రెస్ నిర్వహించిన సహాయ నిరాకరణోద్యమంలో పాలుపంచుకొన్నారు. రెండు సార్లు కారాగారశిక్ష అనుభవించారు. అంతేకాదు, 1930లో రావీ నది ఒడ్డున లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని తీర్మానం చేసినందుకు సంఘం తరఫున కాంగ్రెస్‌ను అభినందించారు. కాంగ్రెస్‌ను అభినందిస్తూ సభలు జరుపవలసినదిగా సంఘశాఖలన్నిటికీ సూచనలు పంపారు.

కాంగ్రెస్ నిర్వహించిన స్వాతంత్ర్య పోరాటాన్ని డాక్టర్‌జీ ఎన్నడూ వ్యతిరేకించలేదు. అనేక సందర్భాలలో సహకారం అందించారు కూడా. కాంగ్రెస్ నాయకులతో అత్యంత గౌరవపూర్వకమైన సంబంధాలు పెట్టుకొన్నారు. సంఘం 1934లో వర్ధాలో నిర్వహించిన హేమంతశిబిరం చూడడానికి గాంధీజీ స్వయంగా వచ్చారు. ఆ తర్వాత సంఘసిద్ధాంతాలను, కార్యపద్ధతిని స్వయంగా డాక్టర్‌జీని అడిగి తెలుసుకొన్నారు. గాంధీజీకి అత్యంత సన్నిహితులైన జమనాలాల్ బజాజ్ ఒక పెద్ద

ఉత్తరం వ్రాసి కొన్ని విషయాలకు సంబంధించిన వివరణ డాక్టర్‌జీని అడిగారు. ఉత్తరాల ద్వారా తెలియ జెప్పడం కంటె స్వయంగా మాట్లాడుకోవడం సులువుగా

ఉంటుందని జమనాలాల్‌జీని ఆహ్వానించగా వారు స్వయంగా వచ్చి డాక్టర్‌జీతో మాట్లాడారు. డాక్టర్‌జీ సన్నిహితులు అప్పాజీ జోషీది వర్ధాయే. వారు కాంగ్రెస్‌లో పదవీ భాధ్యతలు నిర్వహించిన కార్యకర్త కూడా. వారికి జమనాలాల్‌జీతో దగ్గరి పరిచయం కూడా ఉంది.

## రాజకీయాలకు దూరంగా :

రాజకీయ పార్టీలకు దూరంగా ఉంటూ హిందువుల సంఘటనకు పాటు పడటమే సంఘ విధానమని డాక్టర్‌జీ స్పష్టంగా చెప్పారు. కాబట్టి హిందూ సంఘటన కార్యంలో సహకరించడానికి సిద్ధపడిన వ్యక్తులు ఏపార్టీకి చెందిన వారైనా సంఘంలోకి రావచ్చు. మొట్టమొదట్లో కాంగ్రెస్ వారు అనేకమంది సంఘంలో పనిచేశారుకానీ రానురాను సంఘ స్వయంసేవకులకు కాంగ్రెస్ వారు ద్వారాలు మూసివేశారు.

కాంగ్రెస్‌కు, సంఘానికి మధ్యనున్న సిద్ధాంతపరమైన విభేదాలను గూర్చి మాట్లాడుతూ "కాంగ్రెస్ ముస్లిం సంతుష్టీకరణ విధానాన్ని అవలంబించడమే కాకుండా హిందుత్వాభిమానుల్ని ఉపేక్షిస్తోంది. కాబట్టి సంఘం స్వతంత్రంగా హిందూ సంఘటన కార్యాన్ని చేపట్టింది. కాని కాంగ్రెస్ వ్యతిరేక భావం సంఘానికి లేదు. ఒకవేళ కాంగ్రెస్ కార్యకర్తలకు అలా అనిపిస్తే అది పొరపాటు భావనే అవుతుంది." అన్నారు డాక్టర్‌జీ.

"హిందుత్వమే జాతీయత" అని సంఘ విశ్వాసం. ఇది కాంగ్రెస్‌కు గిట్టదు. వారిదంతా అతుకుల బొంత వ్యవహారం. దేశ సరిహద్దుల లోపల నివసిస్తున్న ప్రజలందరిదీ ఈ దేశం అనే అభిప్రాయం కాంగ్రెస్‌ది. కాబట్టి హిందూ సంఘటన కావాలనే వారంతా మతతత్వవాదులని కాంగ్రెస్ దుష్ప్రచారం చేయడం సహజమే. ఈ విధమైన దుష్ప్రచారం ద్వారా సంఘం ముందుకు పోకుండా ఉండే విధంగా ప్రయత్నించడమే కాకుండా డాక్టర్ హర్డీకర్ నాయకత్వంలో కాంగ్రెస్ ఒక సేవాదళాన్ని కూడా ప్రారంభించింది. ఈ విషయంలో వాదోపవాదాల జోలికి పోకుండా పట్టుదలతో పనిచేస్తూ పోవాలని డాక్టర్‌జీ స్వయంసేవకులతో చెపుతుండేవారు. అవాకులు-చెవాకులు ప్రేలే వారికి సమాధానం దానంతటదే లభిస్తుందనేవారు.

## ప్రభుత్వం సాగించిన దాడి :

నాగపూర్ సంఘానికి కేంద్రం కావడం చేత మధ్యప్రదేశ్‌లోనూ, విదర్భలోనూ మొదట సంఘం పని పెరగడం సహజం. అనేక చోట్ల సంఘం పెద్ద పెద్ద

కార్యక్రమాలు నిర్వహించింది. సంఘంలో జరిగే పథసంచలనం, కవాతు, శారీరిక శిక్షణలో కౌశలం, ఆకర్షణీయమైన ఘోష్ దళం (బ్యాండ్) మొదలైన వాటివల్ల అనేకమంది సంఘం పట్ల ఆకర్షింపబడ్డారు. అందుచేత ప్రభుత్వ సిబ్బంది ఎవరూ సంఘానికి వెళ్లగూడదని ప్రభుత్వం 1932లో ఉత్తర్వులు జారీ చేసింది. ఈ ఉత్తరువులో సంఘం రాజకీయ పార్టీయనీ, మతతత్వపార్టీయనీ ఆరోపించారు. ఆ తర్వాత 1934లో మరో ఉత్తరువు జారీ చేసి పంచాయత్ రాజ్ సంస్థలు, ఇతర స్థానిక సంస్థలుకూడా తమ సిబ్బందిని సంఘ కార్యక్రమాలకు హాజరు కానీయ కూడదని సలహా ఇచ్చారు.

ఈ దాడికి డాక్టర్‌జీ గట్టిగా సమాధాన మిచ్చారు. సంఘం రాజకీయ పార్టీగాని, మతతత్వ సంస్థగాని కాదని స్వయంసేవకులకు స్పష్టం చేశారు. సంఘకార్యం నూటికి నూరు పాళ్లు జాతీయ కార్యం అని చెప్పారు. ఒకవేళ ఆలోచనారహితంగా సంఘశాఖలలో జరిగే శారీరక కార్యక్రమాల్లాంటివి నిషేధించినా, సంఘకార్యం ఆగిపోదన్నారు. స్వయంసేవకులు ఏదోరకంగా కలుసుకోగలుగుతారు. అంతా కలిసి ఒకచోట నిద్రపోవడం కూడా శాఖాకార్యక్రమమే అవుతుంది. ప్రభుత్వం జారీ చేసిన సర్క్యులర్ చూసిగాని, అనుసరిస్తున్న దమన నీతిని చూసిగాని గాబరాపడవలసిన అవసరం ఏమాత్రం లేదని చెప్పారు. డాక్టర్‌జీ ఈ విషయాన్ని శాసనసభలో కూడా లేవనెత్తేటట్లు చూశారు.

## పరాభవంపాలైన ప్రభుత్వం:

ఆనాడు 'హోంమెంబర్'గా నున్న ఈడ్పుగంటి రాఘవేంద్రరావు 'హిట్లర్ పద్ధతిలో' డాక్టర్‌జీ సంఘకార్యక్రమాలను నడుపుతున్నారని సభలో ఆరోపణ చేశారు. కాని అది ఋజువు చేయలేక పోయారు. దేశభక్తి నచ్చీలము రక్తంలో జీర్ణించు కొన్న డాక్టర్‌జీ ఆదర్శ జీవనం చూసి ఆ సభలో ఉన్న అన్ని వర్గాలవారు ప్రభావితులైన వారే కాబట్టి రాఘవేంద్రరావు చేసిన ఆరోపణను సవాలు చేస్తూ ఎగతాళిచేశారు. శాసన సభలో ఈ విషయంపైన ప్రవేశపెట్టబడిన కోత తీర్మానం అంగీకరించబడటంతో మంత్రిమండలి పతనమైంది.

సంఘ స్థాపన జరిగాక డాక్టర్‌జీ తమ ప్రసంగాల్లో ఎప్పుడూ హిందూ సంఘటనకు సంబంధించిన విషయాలే ముచ్చటిస్తుండేవారు. ప్రభుత్వవిధానాలకు సంబంధించి సాధారణంగా ఎలాటి వ్యాఖ్యానాలు చేసేవారు కారు. సంఘటన ద్వారానే అన్ని సమస్యలూ పరిష్కారమైపోతాయి. కాబట్టి హిందూవులంతా

సంఘటితమై తమధర్మాన్ని సంస్కృతిని రక్షించుకోవాలి - అనేవారు. ఈ జాతి భావిబాధ్యతలన్నీ హిందూ సమాజంపైనే ఆధారపడి ఉన్నాయి కాబట్టి ఈ సమాజం బలహీనం కావడం పెద్దపాపం అనేవారు. కాని శాసనసభలో జరిగిన ఈ సంఘటన తర్వాత సంఘం నిర్వహించిన ఉత్సవాల్లో మాట్లాడుతున్నప్పుడు ప్రభుత్వాన్ని కఠినంగా విమర్శిస్తూ, ప్రభుత్వపు తెలివితేటలు దివాలా తీశాయనీ, ప్రభుత్వపు పనితీరు తలక్రిందులుగా కనిపిస్తోందని వ్యాఖ్యానించేవారు. సంఘంపై దెబ్బతీయడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు విఫలం కావడంతో సంఘస్వయంసేవకులలో ధైర్యోత్సాహాలు ఇనుమడించాయి. దీనిని సంఘకార్యవిస్తరణలో డాక్టర్‌జీ బాగా వినియోగించు కొన్నారు.

స్వాతంత్ర్యం రాకముందు దేశాన్ని పాలించే విదేశీయులు సంఘాన్ని అంతం చెయ్యాలని ప్రయత్నించడాన్ని అర్థంచేసుకోవచ్చు కాని స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత అలాంటి స్థితి రాకూడదు కదా ! డాక్టర్‌జీ మరణానంతరం, దేశానికి స్వాతంత్ర్యం లభించాక కాంగ్రెస్ రెండుసార్లు సంఘంపై నిషేధం విధించి అపరిమితమైన దుష్ప్రచారం సాగించింది. అధికారం చేజిక్కిన తర్వాత కాంగ్రెస్ సంఘానికి సహకారం అందించక పోయినా దానికి అన్యాయం తలపెట్టదని అంతా భావించారు. కాని కాంగ్రెసు అందుకు భిన్నంగా వ్యవహరించింది.

### *సంఘం సమాజంలో భాగమే :*

సంఘానికీ, హిందూ సమాజానికీ మధ్య పెనవేసుకొని ఉన్న సూత్రాన్ని స్వయంసేవకుల మనస్సులలోనూ, ప్రజల మనస్సులలోనూ గట్టిగా హత్తుకు పోయేట్లు చేయడం డాక్టర్‌జీ నాయకత్వ లక్షణానికి నిదర్శనం. సంఘస్థాపన తర్వాత రెండు సంవత్సరాలకు జరిగిన ఒక సంఘటన దీన్ని గుర్తుకుతెస్తుంటి. 1922 తర్వాత నాగపూర్ పట్టణంలో హిందువులకూ ముస్లింలకు మధ్య ఉద్రిక్తత నెలకొని ఉన్నది. ముస్లింలు దౌర్జన్యానికి తలపడుతూ ఏదో ఒక మిషమీద హిందువులను సతాయిస్తుండే వారు. ఆ స్థితి కేవలం నాగపూర్‌లోనే కాక, భారతదేశం అంతటా ఉండేది. అనేకచోట్ల దాడులు జరుగుతూండేవి. డాక్టర్‌జీ ఈ దాడులను "ముసల్మాను దాడులు" అని పిలుస్తుండేవారు. ఖిలాఫత్ ఉద్యమం విఫలం కాగా ఈ దేశంలో ఉన్న ముస్లింలు ఉక్రోషంతో హిందువులపైన ఆ కోపం తీర్చుకున్నారు.

హిందూ సమాజంలో ప్రభావంగల వ్యక్తి కావడాన సహజంగానే డాక్టర్‌జీ ఇంటిపైన రాళ్లురువ్వడం, బెదిరిస్తూ లేఖలు వ్రాయడం జరుగుతూ ఉండేది. ఈ

ఉద్రిక్త వాతావరణం కొనసాగుతూ ఉండగా 1927 సెప్టెంబర్‌లో హిందువుల పండుగ రోజున నాగపూర్‌లో పెద్ద ఎత్తున హింసాకాండ జరపాలని ముస్లింలు కుట్రపన్నారు. సరిగ్గా మధ్యాహ్నం రెండుగంటలకు 'దీన్ దీన్', 'అల్లాహొ అక్బర్' అని నినాదాలు చేసుకొంటూ మారణాయుధాలతో ముస్లింల ఊరేగింపు బయలుదేరింది. మహల్ ప్రాంతంలోకి చేరగానే ఆ సందులు, గొందులులోకి చొరవడి పండుగ పిండివంటలు తింటూ అజాగ్రత్తగా ఉన్న హిందువులపై దాడిచేసి సర్వం దోచుకొనాలనేది వాళ్ల పథకం. కాని సందులలో ప్రవేశించడమే తరువాయి లాఠీ దెబ్బలతో తలకాయలు పగులడం ప్రారభమైంది. 'తోబా' 'తోబా' అనుకొంటూ ముస్లిం గూండాలు వెన్నిచ్చి పారిపోవడం ప్రారంభించారు. హిందువులు జాగ్రత్త పడడంతో ముసల్మానులు కాలికి బుద్ధి చెప్పకతప్పలేదు.

ముసల్మానుల ఆక్రమణను త్రిప్పికొట్టింది ఎవరైందీ క్షణాలమీద నాగపూర్ అంతా తెలిసిపోయింది. సాలూబాయీ మోహితే మైదానంలో రోజూజరిగే సంఘశాఖలో పాల్గొంటున్న ఫుందమంది యువకిశోరాల కారణంగా ఒకపెద్ద ప్రమాదం తప్పిపోయిందన్న ప్రశంస నలుదిక్కులా వినిపించింది. అంతవరకూ ప్రతిచోటా దాడులలో హిందువులు బాగా దెబ్బతినడం ఆనవాయితీ. గాంధీజీ కూడా "హిందువులు పిరికివారు" అని వ్యాఖ్యానించియున్నారు. దెబ్బలుతినే ఈ అలవాటుకు చరమగీతం పాడి చరిత్రను సృష్టించింది నాగపూర్ నగరం. ముసల్మానులకు చక్కటి గుణపాఠం కూడా నేర్పింది. ఆ తర్వాత ఎన్నడూ ముసల్మానుల దాడులు నాగపూర్‌లో జరుగనే లేదు. హిందూ సమాజం సంఘటితమై పరాక్రమం ప్రదర్శించినపుడు ఎలాటి సత్ఫలితాలు లభిస్తాయో చెప్పడానికి డాక్టర్‌జీ ఈ ఉదాహరణ ఉటంకిస్తూ, స్వయంసేవకులను, హిందూ సమాజాన్ని జాగృతపరచే ప్రయత్నం చేసేవారు. స్వయంసేవకుల పరాక్రమం అనకుండా హిందూసమాజ పరాక్రమం అనడంలో ఉద్దేశ్యం సంఘం సమాజంలో భాగమని చెప్పటమే. ఇలాంటి విషయాలలో సమాజాన్ని తనతోపాటు తీసికొని పోతూనే సంఘం పని చేస్తుంది. తనకు ఏవిధమైన ప్రతిష్ఠ లభించినా అదియావత్ హిందూ సమాజానిదే అవుతుంది అన్నదే సంఘభావన.

ఈ మౌలిక దృష్టికోణం సమాజంలో ఆత్మవిశ్వాసం నిర్మాణం చేయడంలో తోడ్పడింది. ఎక్కడైనా, ఏదైనా ఉపద్రవం ఏర్పడినపుడు కొంతమంది స్వయంసేవకులను పంపించండి అంటూ డాక్టర్‌జీని అడిగితే వారు ఆ అభ్యర్థనను మన్నించేవారు కారు. సమాజం తన కర్తవ్యాన్ని మరచి చేతులు ముడుచుకు

కూర్చుంటే స్వయంసేవకులు పోలీసు పాత్రను వహించి రక్షణకు సిద్ధం కావడమనే ఆలోచనను డాక్టర్జీ ఎన్నడూ ఒప్పుకోలేదు. కష్టాలు వచ్చినపుడు వాటినుంచి రక్షించు కోవటానికి స్వయంగా నడుంకట్టి ముందుకు రావాలి. ధైర్యంగా ఎదుర్కోవాలి. స్వయంసేవకులు కూడా సమాజంలో అవయవ స్వరూపులే. సమాజంలో అందరితో పాటు వాళ్లు కూడా తమ కర్తవ్యం నిర్వహిస్తారు. మేము ఒంటరిగాళ్లం, మేము ఏమి చేయగల్గుతాం అనే దుర్బల భావన హిందూ సమాజంలో ఎవరికీ రాకూడదు. హిందూసమాజం ఇంతపెద్దదై ఉండి కూడా ప్రతివ్యక్తీ 'నేను ఒక్కడినే ఏమి చేయ గలను' అనుకోవడం ఒక వికృతి. ఏకాస్త గొడవ జరిగినా అంతాభయపడిపోయి పరుగులు తీస్తూ, "నేనొక్కడినే ఏమి చేస్తా ను, చెప్పండి?" అంటూ ఉంటే డాక్టర్జీకి ఎంతో బాధకలిగేది. ఇలాంటి సంఘటనలు స్వయంసేవకుల సమావేశాల్లో కథలు చెప్పినట్లు చెవుతూ సంఘటన ఎంత అవసరమో తెలియ చెవుతు ండేవారు. అవకాశం దొరకినపుడెల్లా ప్రజలలో "మీరు ధైర్యంతో మీ కార్యక్రమాలు కొనసాగిస్తూ ఉంటే మేము మీకు అండగా ఉంటాం" అనేవారు. నాగపూర్‌లోని అనాథ విద్యార్థి ఆశ్రమంవారి గణేశ నిమజ్జనం ఊరేగింపుకు ఏరకమైన ఉపద్రవం రాకుండా డాక్టర్జీ ఎన్నో సంవత్సరాలు జాగ్రత్త పడ్డారు. "మసీదుల ముందు మేళతాళాలు ఆపుచేసే పిరికితనం ప్రదర్శించకండి. ఏదైనా గొడవ జరిగితే మీరు ఒకరే ఉన్నారని అనుకోకోండి. మేమంతా ఉంటాం" అని ప్రజలకు స్పష్టంగా చెప్పేవారు.

సంఘంవేరు, సమాజంవేరు అనేభావన నిర్మాణం కాకుండా చూచేవారు డాక్టర్జీ. సంఘస్థాన్ కార్యక్రమాలలో పాల్గొంటున్న బాల, తరుణ స్వయంసేవకులు ఆ కొద్ది సేపు ప్రత్యేకంగా కనిపించవచ్చు, కాని వారి శక్తి సామూజిక శక్తియే. మిగతా సమయంలో వారు సమాజంలో ఒకరుగానే ఉంటారు. ఈ విషయాన్ని గుర్తించి వ్యవహరిస్తున్నందునల్లనే సంఘం ఒక సైనిక దళంలాగా మారిపోకుండా ఉంది. సంఘం, సమాజం మరింతగా అవిభాజ్యమైనాయి. సంఘం వలన సమాజం మరింతగా శక్తి సంపన్నం అయింది. విషమ పరిస్థితులలో ధైర్యంగా నిలబడి పరిస్థితుల నెదుర్కొనే వ్యక్తులు తయారయినారు. దేశవిభజనకు పూర్వం, దేశవిభజన జరిగిన వెంటనే తల ఎత్తిన భయంకర పరిస్థితులలో స్వయంసేవకులు సమాజాన్ని తమతోపాటు నడిపించి రక్షణ కార్యక్రమాలు కొనసాగించారంటే సంఘశాఖలో అలవరచుకొన్న ఈ ఆత్మీయత, నిస్వార్థసేవాభావాలే అందుకు కారణం.

# 3

ఒక సంస్థ విజయవంతంగా పనిచేయడానికి సిద్ధాంతబలం ఎంత అవసరమో కార్యకర్తల బలం కూడా అంతే అవసరం. కార్యకర్తలను తీర్చిదిద్దడంలో డాక్టర్‌జీ ఎంతో శ్రద్ధతీసుకొనేవారు. అడుగడుగునా వారు ఆదర్శంగా నిలచి ఇతరులు తమనుతాము మలచుకొనేట్లు చేసేవారు.

## విగ్రహాన్ని మలచే శిల్పి:

వ్యక్తులను సంఘటితపరచి వారిలోని గుణాలను వికసింపజేసి, దోషాలను సాధ్యమైనంత వరకు తొలగించి, వారిని కార్యరంగంలోకి దింపడం ద్వారా పనిలో రాశిలోనూ, వాసిలోనూ అభివృద్ధితేవడమే సమర్థుడైన నాయకుని లక్షణం. అయితే ఇటువంటి లక్షణాలు కేవలం ఒకరిద్దరు వ్యక్తులలో ఉంటే సరిపోదు. ప్రతి కార్యకర్తలోనూ ఈ లక్షణాలు ఉండాలి. ఈ విషయంలో డాక్టర్‌జీ ఎప్పుడూ జాగరూకులై ఉండేవారు. కార్యకర్తలలోని దోషాలను ఎరుకపరచి వారిలో గుణాలు వికసింపజేసిన ఉదంతాలు డాక్టర్‌జీ జీవితంలో ఎన్నో చెప్పవచ్చు. 1936లో మహారాష్ట్రలోని ఫౌజ్‌పూర్‌లో కాంగ్రెసు మహాసభలు జరుగుతున్నపుడు జెండా ఎగరేస్తుండగా అది మధ్యలో చిక్కుకుని ఆగిపోయింది. 50 అడుగులు పైగా ఉన్న ధ్వజస్థంభాన్ని ఎక్కి ఆ త్రాడు సరిచేసే ధైర్యం ఎవరికీ లేకపోయింది. కార్యక్రమమంతా ఆగిపోయింది. అప్పుడు ఒక యువకుడు ముందుకువచ్చి చరచరా ఆధ్వజస్థంభంపైకి ప్రాకి చివరి భాగంలో త్రాడును సరిచేసి జెండాపూర్తిగా ఎగిరేట్లు చేశాడు. అందరూ ఆనందంతో ఊపిరి పీల్చు కున్నారు. నెహ్రూగారితో సహా

అక్కడివారంతా ఆ యువకుడి సాహసాన్ని ప్రశంసించారు. అతనికి సన్మానం చేయాలని కూడా నిర్ణయించుకున్నారు. తీరా ఆ యువకుడు సంఘ స్వయంసేవక్ అని తెలిసింది. అంతే నెహ్రూ గారి ఉత్సాహం నీరుగారిపోయింది. సన్మానం సంగతి వదిలేశా రు.

డాక్టర్‌జీకి ఈ ఉదంతం తెలిసింది. కిషన్‌సింగ్ పరదేశి అనుపేరుగల ఆ స్వయంసేవక్ చేసిన పనికి ఆయన ఎంతో గర్వపడ్డారు. ఆ తరువాత ప్రత్యేకంగా అందుకుగాను కొంత సమయంకేటాయించి అతని స్వగ్రామమైన ధూలియా కు వెళ్లి ఆ స్వయంసేవకుని కలుసుకొని సంఘ శాఖలో అందరిముందు ఒక వెండి కప్పు బహూకరించారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ కాంగ్రెస్ కూడా దేశకార్యం చేస్తున్న ఒక సంస్థ అన్నభావం వెలిబుచ్చుతూ– "ఎక్కడైనా సరే దేశకార్యం జరుగుతున్నప్పుడు ఏదైనా అడ్డంకి వస్తే అదితొలగించగల విశ్వాసం మనకున్నపుడు పార్టీ భేదాలు పాటించక ముందుకురావాలి" అన్నారు డాక్టర్‌జీ. ఇలాంటి సంఘటనల ద్వారా స్వయంసేవకుల మనస్సులలో ఎలాంటి ఉదాత్తమూ, ఉదారమూనైన సంస్కారాలు ఏర్పడతాయో మనం ఊహించుకోవచ్చు. స్వయంగా సర్‌సంఘచాలక్ గారే వచ్చి తనను అభినందించి నందుకు కిషన్‌సింగ్‌కు పట్టరాని సంతోషం కలిగింది.



స్వయంసేవకులు ఎలా ఉండాలో చెప్పడమేకాదు, ఎలా ఉండకూడదో కూడా డాక్టర్‌జీ చెప్పిన సందర్భాలున్నాయి. నాగపూర్‌లోని ఒక శాఖలో స్వయం సేవకులు తమలో తాము కొట్లాడుకొన్నారు. స్వయంసేవకులలో పరస్పరం ప్రేమ అనురాగాలు వర్ధిల్లాలి. అది పోయి కొట్లాడుకొన్నారంటే చాలా బాధ పడవలసిన విషయమే. ఒక రోజు డాక్టర్‌జీ ఆ శాఖకు వెళ్ళారు. శాఖలో ఉన్న స్వయంసేవకుల నందరినీ ఒక చోట చేర్చి పరస్పరం స్నేహభావాన్ని పెంపొందించుకోవడమే సంఘ కార్యానికి ఆధారం అంటూ ఎంతో భావయుక్తంగా చెప్పారు. సోదర స్వయం సేవకులపై చేయిచేసుకొన్న వారు శిక్ష అనుభవించవలసిందే నన్నారు. ఆ కొట్టిన వారు కొద్ది రోజులు శాఖకు రావడానికి వీల్లేదన్నారు. అయితే వాళ్ళు డాక్టర్‌జీని ఇంటి వద్ద కలుసుకోవచ్చునని ఒక సౌలభ్యం కూడ కలుగ జేశారు. కాని శాఖకు రావద్దనడం కంటె స్వయంసేవకునికి పెద్ద శిక్ష ఏముంటుంది? శిక్షవిధించబడిన స్వయంసేవకుల కండ్ల వెంట నీళ్ళు కారుతున్నాయి. అయినా డాక్టర్‌జీ హృదయం చలించలేదు. క్రమ శిక్షణ పాటించడం కష్టమే! మరుపురాని సంఘటన అది.

మిగతా సంస్థలలో అలాంటి శిక్షవిధిస్తే– మళ్ళీ ఆ సంస్థ ముఖం చూడకుండా పోతారు. ఇక్కడేమో శాఖ నుంచి వెలివేయ బడిన వ్యక్తులకు దుఃఖం కట్టలు త్రెంచుకొని వచ్చింది. అందుచేత శిక్షా కాలం ముగిసి మళ్ళీ శాఖకు వచ్చిన రోజున వారిముఖాలు వికసించాయి. వారిలో ఒకరు ఆ తర్వాత చాలా పెద్ద బాధ్యత– అంటే ప్రాంత ప్రచారక్ బాధ్యత– నిర్వహించారు. నాగపూర్‌లో అలాంటి సంఘటన మళ్ళీ జరుగలేదు. డాక్టర్‌జీ కూడా ఆ సంగతి మళ్ళీ ప్రస్తావించలేదు. అయితే పరోక్షంగా ఆ సంఘటన గుర్తుకు తెస్తూ ఒకసారి తమ ప్రసంగంలో ఇలా అన్నారు. "మిత్రుని మీద ప్రేమ ముఖ్యమా, సంఘంపైన ప్రేమ ముఖ్యమా అన్న ప్రశ్న వచ్చినప్పుడు కాని; కుటుంబ కార్యం ముఖ్యమా, సంఘకార్యం ముఖ్యమా అన్న ప్రశ్న ఉదయించినపుడుకాని దానికి సమాధానం ఒక్కటే– సంఘం ముఖ్యం. మిత్ర ప్రేమ, కుటుంబ కార్యం ఆ తర్వాతనే. సంఘకార్యం మినహా వ్యక్తిగత సుఖదుఃఖాలు ఏవైనప్పటికీ సంఘం కోసం వాటిని సంతోషంగా ప్రక్కకు పెట్టాల్సిందే. సంఘంలో నీదైన ఒక వర్గాన్ని తయారు చేసికోవద్దు. సంఘం యావత్తూ నీదే. సంఘం కోసమే జీవిద్దాం. సంఘం కోసమే మరణిద్దాం– అన్న సంకల్పం మనస్సులో ఉంచుకొని వ్యవహరించాలి."

## అజాత శత్రువు:

డాక్టర్‌జీ నిష్కలంక జీవితాన్ని గడిపారు. విరోధులు కూడా డాక్టర్‌జీ ప్రవర్తనకు సంబంధించి వ్రేలెత్తి చూపలేకపోయేవారు. కార్యకర్తలు నిర్మలమైన శీలగుణ సంపన్నులుగా ఉండాలంటుండేవారు డాక్టర్‌జీ. ముందు మనుషుల నిర్మాణం జరగాలనీ, తద్వారా కార్యవిస్తరణ జరగాలని అనేవారు. కాబట్టి సౌశీల్యానికి సంబంధించినంతవరకు 'పోనీలే' అన్నధోరణి ఎప్పుడూలేదు. సంఘంలో ఎదుటి వారిని చూచి అనుభవం ద్వారా నేర్చుకున్నంతగా మాటలద్వారా ఎవరూ నేర్చుకో లేదు. చైతన్యం తొణికిసలాడే డాక్టర్‌జీ జీవితం స్వయంసేవకులకు ఆదర్శంగా ఉండేది. దగ్గిర నుంచి చూసేకొద్దీ డాక్టర్‌జీలోని గొప్పదనం అధికమై కనిపించేది. అందువల్ల వారిపట్ల ఆకర్షణ పెరుగుతూనే పోయేది. వారి చెలిమిలో ఏదో ఆకట్టుకొనే మాధుర్యం ఉంది. అదే కాకుండా "నేను గొప్పవాడిని" అన్న భావనగాని, డంబాచారంగాని, ఆయనలో మచ్చుకు కూడా కానరావు.

1939లో హిందూ యువక పరిషత్ ఆహ్వానంపై పూనా వెళ్లినపుడు టీ సేవిస్తూ ఆచార్య అత్రేగారింట్లో కొంతసేపు గడిపే ఏర్పాటు జరిగింది. డాక్టర్‌జీ లాంటి వారు తమ ఇంటికి వస్తే ఎలాంటి ఏర్పాట్లు చేయాలో అని ఆచార్య అత్రే తటపటాయించారు. తీరా డాక్టర్‌జీ వచ్చి కాసేపు ఆ కబుర్లు, ఈ కబుర్లు మాట్లాడిన తర్వాత సంకోచం అంతా పోయి– ఆ కుటుంబానికి చెందిన పెద్దాయన ఒకరు ఇంట్లో తిరుగాడుతున్నట్లే అనిపించిందన్నారు. డాక్టర్‌జీ నిరాడంబర వ్యవహారం, ప్రసన్న వదనం, స్నేహశీలత, ఎక్కడైనా ఎవరితోనైనా కలిసి పోయే స్వభావం ఎల్లెడలా వారిని స్వాగతించేట్లు చేసేవి. స్వయంసేవకులందరిలో ఇలాంటి గుణాలు ఉండాలని వారు కోరేవారు.

## సహజగుణాన్నే మార్చుకొన్న మహనీయుడు:

డాక్టర్‌జీ స్వీయజీవితంలో ఆచరించి చూపిన మరో విషయం కూడా గమనించ తగినది. వారు బాల్యం నుండి ఉగ్ర స్వభావులు. కోపం వస్తే పట్టలేరు. స్వాభావికంగా వచ్చిన గుణం పోదంటారు చాలా మంది. "స్వభావోదురతిక్రమః" అన్న లోకోక్తికూడా ఉంది. కాని స్నేహసూత్రంతో వ్యక్తులను కలిపి సంఘటన కార్యంలో పాలుపంచుకొనేటట్లు చేయాలనుకొన్నాక తమ స్వభావాన్ని డాక్టర్‌జీ పూర్తిగా మార్చుకొన్నారు. తమ స్వభావం కారణంగా సంఘానికి ఏ మాత్రం నష్టం జరుగకూడదనీ, క్రొత్తక్రొత్త వారు సంఘకార్యంలో జోడింపబడ్తూనే ఉండాలనీ

డాక్టర్‌జీ కోరుకొనేవారు. పుట్టుకతో అబ్బిన దేశభక్తి నిస్వార్థచింతన, కష్టపడిపనిచేసే గుణం, మిత్రమండలిని కలిపిఉంచి కలిసికట్టుగా పనిచేసే కుశలత డాక్టర్‌జీలో పుష్కలంగా ఉండేవి. అయితే ధ్యేయసాధనలో తమ ఉగ్రస్వభావం అడ్డుగా నిలుస్తుందని భావించి, ఆ ఒక్క అవగుణాన్ని కూడా తొలగించుకొని సహనశీలతను అలవాటు చేసికొన్నారు. వారికన్నుల నుండి స్నేహామృతం వర్షించేది. "నాలో ఉన్న గుణాలివి. మీకు ఎంతవరకు ఉపయోగపడితే అంతవరకు ఉపయోగించుకోండి. నేను మాత్రం మారలేను." అంటుంటారు చాలా మంది. కానీ డాక్టర్‌జీకి సంఘకార్యంలో ఈ భావ నచ్చేది కాదు. 'సంఘకార్య నిర్వహణలో ఏ విధమైన ప్రవర్తన ఉంటే బాగుంటుందో అలాంటి ప్రవర్తనే అలవాటుచేసుకొంటాను. అందుకుగాను అవసరమైనరీతిలో నా స్వభావాన్ని మార్చుకొంటాను' అనే నిశ్చయం స్వయంసేవకులలో ఉండాలని కోరుకొనేవారు డాక్టర్‌జీ.

డాక్టర్‌జీ దేశకార్యానికే జీవితాన్ని అంకితం చేయాలని కుటుంబ బాధ్యతలు పెట్టుకోరాదని నిర్ణయించుకొన్నారు. సంపాదించాలని కాని, సంసారాన్ని నిలబెట్టుకో వాలనిగాని ఆలోచనే లేనప్పుడు అంతకష్టపడి డాక్టరుకోర్సు చదవడమెందుకు? అన్న ప్రశ్నకు వారే సమాధానం చెపుతూ– సమాజకార్యం కొనసాగిస్తున్నప్పుడు కూడ విద్యార్హతలకు ఒక స్థానం ఉంది అనేవారు. డాక్టరు కోర్సులో ఉత్తీర్ణత పొంది, బాగా సంపాదించటానికి తగిన యోగ్యతపొంది, దానిని వదిలేస్తే సమాజం ఎంతో విలువనిస్తుంది. ఇంకేపనీ చేయటానికి పనికిరాక దేశకార్యంలోకి దిగాడు అంటూ పరిహాసం చేసే సాహసం ఎవరికీ ఉండదు అనేవారు.

## సర్వసమర్పణకు పిలుపు:

'ఎంతపెద్ద చదువులు చదువుకోగల్గితే అంత పెద్ద చదువులు చదవండి. అర్హతలను ఎంత పెంపొందించు కోగల్గితే అంత పెంపొందించు కోండి. ఆ తర్వాత మీకు మీరుగా మీ జీవితాలను సంఘకార్యానికి అంకితం చేయండి' అంటూ సమాజ కార్యం చేపట్టి పనిచేయటానికి ముందుకు ఉరికే యువకులను ఉద్బోధించేవారు డాక్టర్‌జీ. వారు అవలంబించిన ఈ విధానం వల్లనే అగ్రశేణి సంఘ కార్యకర్తలలో మేధావులు, పెద్దపెద్ద అర్హతలు సంపాదించిన ప్రతిష్ఠా సంపన్నులు కనబడతారు. ఇతర ప్రాంతాలకు వెళ్ళి ఉన్నతవిద్యను అభ్యసించగల్గిన స్థోమతకలవారు అలా చేయాలనికూడా వారు చెప్పేవారు. డాక్టర్‌జీ ప్రేరణవల్లనే 1928లో భయ్యాజీ దాణీ, ఇంకా ఇద్దరు స్వయంసేవకులు కాశీ హిందూ విశ్వ విద్యాలయంలో చదువుకునేందుకు వెళ్ళి అక్కడ సంఘశాఖ ప్రారంభించారు.

భావూరావ్ దేవరస్ లక్నోలో ఉన్నత విద్య కొనసాగించారు. కార్య విస్తరణ గురించి, సంఘకార్యం పట్ల, సంఘకార్యకర్తలపట్ల సమాజంలో ఆదరభావం నిర్మాణం కావడం గురించి డాక్టర్‌జీ అద్భుతంగా ఆలోచించేవారు. వివాహంమీద, గృహస్థ జీవనంమీద వ్యామోహం విడిచిపెట్టి జాతికోసం సంపూర్ణ జీవనాన్ని అర్పితంచేసేందుకు కావలసిన ప్రేరణ స్వయంసేవకులకు డాక్టర్‌జీ జీవితంనుంచే లభించింది. పేదరికం, సాధనసంపత్తుల కొరత, దుష్ప్రచార ప్రభావం, సమాజంలోని అనకూలత, ఉదాసీనత– ఇవేవీ పరిపూర్ణ ధ్యేయనిష్ఠ గలవారికి అడ్డంకులు కాజాలవు. జయాపజయాల ప్రభావం వారిని వేధించదు. అన్ని అడ్డంకులనూ అధిగమించి ముందుకు సాగగలుగుతారు. డాక్టర్‌జీ జీవిత చరిత్ర ఈ మూల్యాలకు సజీవ చిత్రణ. స్వయంసేవకులకు నిత్యప్రేరణదాయిని. డాక్టర్‌జీ సంఘకార్యంతో సంపూర్ణంగా ఏకరూపులైనారు. ఇలాంటి తాదాత్మ్యతే కార్యకర్తల జీవనంలో కూడా నిర్మాణం అవుతూ వచ్చింది. కార్యకర్తల సుగుణాల పంటకు డాక్టర్‌జీ జీవనమొక దివ్యమైన మాగాణి క్షేత్రం.

## *రాష్ట్ర సేవికా సమితి:*

డాక్టర్‌జీ జీవితంలోని మరొక ముఖ్య సంఘటన– హిందూ యువకులలో సంఘకార్యం విస్తరించటం చూచి వర్ధాలోని ఒక స్వయంసేవకుని తల్లి శ్రీమతి లక్ష్మీబాయి కేల్కర్ గారికి– ఈమెనే మౌసీజీ అని పిలుస్తారు– స్త్రీలలో కూడా ఇలాంటి సంఘటన నిర్మాణం చేయటం అవసరం అనిపించింది. అందుచేత ఆమె అప్పాజీ జోషిని తోడుతీసుకొని వచ్చి డాక్టర్‌జీని కలుసుకొని మాట్లాడారు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘంలో స్త్రీల విభాగం ప్రారంభించటానికి డాక్టర్‌జీ ఇష్టపడలేదు. కానీ హిందూ మహిళలు సంఘాన్ని పోలిన స్వతంత్ర సంఘటనను నిర్మాణం చేసు కోడానికి ఎలాంటి అభ్యంతరమూ ఉండదని చెప్పారు. అలాంటి మహిళా సంఘటనకు 'రాష్ట్ర సేవికా సమితి' అనే పేరు పెట్టాలనికూడా నిర్ణయమయింది. శ్రీమతి మౌసీకేల్కర్ సమితిని ప్రారంభించారు. అన్ని చోట్లకు విస్తరింప చేశారు. మౌసీజీ మరణించిన తర్వాత పూనాకు చెందిన సరస్వతీబాయి సమితి కార్యభారాన్ని స్వీకరించి నడుపుతున్నారు.

## *విశ్రాంతి ఎక్కడ?*

1925లో సంఘాన్ని స్థాపించి, పెంచి పోషించి, అహర్నిశలూ సంఘవ్యాప్తికి అవిశ్రాంతమైన కృషిని సాగించిన ఫలితంగా డాక్టర్‌జీ శారీరక శక్తి క్షీణించి ఆరోగ్యం

దెబ్బతిన్నది. వస్తుతః డాక్టర్‌జీ మంచి శరీరసౌష్టవం కలిగిఉండటమేగాక మొదటినుంచీ వ్యాయామం చేసి శారీరక దార్ఢ్యతను పెంచుకొన్నారు. వారిది ఎంతదృఢమైన శరీరం అంటే– భుజాలపైన పిడికిళ్ళతో గుద్ది తనను నొప్పించమని పందెం వేసి గెలిచారు. కలకత్తాలో భోజనశాల యజమానికి తన తిండి పుష్టిని చూపించి ప్రతిరోజూ పెద్దపాత్రనిండా గదికి భోజనం పంపించే ఏర్పాటు చేసుకొని పేద వారైన మరో ఇద్దరు మిత్రులతో కలసి భుజించేవారు. కారాగారంలో కష్టాలు ఎంతో సహనంతో భరించేవారు. ఎంత కష్టాలకు అలవాటుపడ్డ శరీరం అయితే మాత్రం– మితిమీరిన శ్రమతో, ఆలోచనలతో వేళకు నిద్రపోక, ఆహారం తీసుకోక అమిత ప్రయాసకు గురిచేస్తే తట్టుకోగలుగుతుందా ? తెల్లవారు జామున లేచినది మొదలు తీరికలేని సంభాషణలు, సమావేశాలు, కాలికి బలపం కట్టుకొని తిరగడం, కార్యక్రమాలు రూపొందించటమే కాక, కొన్ని చోట్ల దగ్గిర ఉండి నిర్వహించటం, కార్యవిస్తరణ కొరకు నిరంతరం ఆలోచించడం– ఇలా యెడతెరిపిలేని పని. దీనికి




తోడు పర్యటనలు– అక్కడ కూడా ఉరుకులు పరుగులతోకూడిన కార్యక్రమాల ఒత్తిడి. ఒకసారి సాంగ్లీకి వెళ్తూ రైలులో చోటుకోసం వెతుక్కుంటూ ప్రయాణికుల రద్దీలో యిరుక్కుపోయి నడుము దెబ్బతిని ఎనిమిది రోజులు సాంగ్లీలోనే మంచాన పడ్డారు. పర్యటన చేస్తున్నప్పుడు రాత్రిపూట సమావేశాలు నిర్వహించటంలో కొన్ని రాత్రులు జాగరణ చేయవలసి వచ్చేది. వారు సంభాషణలలో, ప్రసంగాలలో వ్యక్తంచేసే విషయాలను బట్టి చూస్తే సంఘవ్యాప్తికి సంబంధించిన విషయాలే వారి మనస్సును ఎక్కువగా పీడిస్తుండేవి అనేది బోధపడుతుంది. బయటివారికి సంఘం పని చాలా వేగంగా జరుగుతున్నట్లు అనిపించేది. కాని డాక్టర్‌జీకి మాత్రం దేశ అవసరాలను దృష్టిలో ఉంచుకొని చూస్తే పనివేగం చాలా తక్కువగా ఉందనిపించేది.

సంఘస్థాపన తర్వాత ఏడేళ్ళకు అనగా 1932లో మొదటిసారిగా డాక్టర్‌జీకి పెద్ద జబ్బుచేసింది. అంతకుముందు కొంతకాలంగా వెన్నుపూస నొప్పితో బాధపడుతూ వచ్చారు. 1932లో నాగపూర్‌లో ఉన్న ధంతోలీలో డాక్టర్ హరదయాల్ గారి ఇంట్లో ఉండి రెండు మాసాలపాటు విశ్రాంతి తీసుకోవటానికి ఏర్పాట్లు జరిగాయి. ఆ తర్వాత మళ్ళీ వారి ఆరోగ్యం బాగాదెబ్బతినటంతో ధరమ్‌పేటలోని వైద్యవకీలుగారి ఇంట్లో ఉండి నాలుగుమాసాలుపాటు విశ్రాంతి తీసుకో మన్నారు. పేరుకే అది విశ్రాంతి. డాక్టర్‌జీకి మంచంమీద పడివుండటం బొత్తిగా నచ్చేదికాదు. 1932లోనూ 1934లోనూ అనారోగ్యంతో బాధపడుతూకూడ సంఘకార్యాన్ని గూర్చి ఆలోచనచేస్తూనే ఉండేవారు. ఉత్తరప్రత్యుత్తరాలు .కొనసాగుతూనే ఉండేవి. వివిధ శాఖలనుండి స్వయంసేవకులు చిన్నచిన్న జట్లుగా వచ్చి చూసిపోతుండేవారు. బాల, తరుణ స్వయంసేవకులతో కబుర్లుసాగుతూనే వుండేవి. ప్రతివ్యక్తితోనూ వ్యక్తిగత పరిచయం పెట్టుకోవటం వారికి చాలా ఇష్టం. వ్యాధిని మరిచిపోయి పరిహాసోక్తులతో స్వయంసేవకులను ఉత్సాహ పరుస్తుండే వారు. రాత్రిపూట బాగా పొద్దుపోయేవరకూ సమావేశములు సాగుతూనే ఉండేవి.

స్వయంసేవకులతో మాట్లాడకుండా ఉండటం అంటే వారు సహించలేకపోయే వారు. వైద్యవకీలు బంగళాలో డాక్టర్‌జీ ఉండగా ఒక సారి ఒక పెద్దాయన వచ్చి 'ఇక్కడ డాక్టరుగారొకరుండాలి ఉన్నారా?' అని చౌకీదారును అడిగాడు. దానికి సమాధానంగా 'ఇక్కడ ధర్మామీటరుతో రోగులను పరీక్షచేసే డాక్టరుగారు ఎవరూలేరు. అయితే ఎప్పుడూ పిల్లవాళ్ళను నవ్విస్తూ, కవ్విస్తూ ఉండే డాక్టరుగారు ఒకాయన ఉన్నారు' అనిచెప్పాడు చౌకీదారు. అతడు చెప్పిన సమాధానంలో ఎంతో అర్థం ఉంది. డాక్టర్‌జీవలే ధ్యేయంతో ఏకరూపులైన మహాపురుషుల దృష్టిలో శరీరం అనేది కార్యనిర్వహణకు పరికరం. ఈ శరీరంపట్ల అంతకంటె ఎక్కువ వ్యామోహం వారికి ఉండదు.

వెన్ను నొప్పి సంగతి చాలా కాలం వరకు వారు ఎవరికీ తెలియనీయలేదు. మృత్యువు సమీపించే వరకూ ఆనొప్పి కొనసాగుతూనే ఉంది. కాని అకారణంగా తమ పర్యటనలోకానీ, ఇతర దినచర్యలోకానీ ఎలాంటి వ్యత్యాసమూ రానిచ్చేవారుకారు. తాను బాధపడుతున్న విషయం ఇతరులకు తెలియనిచ్చేవారు కాదు. ప్రసన్న చిత్తంతో పనులు చేసుకుపోతుండే వారు. ప్రతిసంవత్సరం కొంత కాలం విశ్రాంతి తీసుకోమని వారికి చెప్పటం అయితే జరుగుతుండేది కాని పనుల వత్తిడిలో విశ్రాంతికి స్వస్తి చెప్పారు. ఇతర ప్రాంతాలలోకూడ .కార్యవిస్తరణ జరిగాక దీర్ఘకాలిక పర్యటనలు

జరుపవలసి వచ్చేది. వారికి విపరీతంగా చమటపడుతుండేది. చెమటకు తడిసి ఒక్కోసారి రోజుకు అయిదారుసార్లు బట్టలు మార్చుకోవలసి వచ్చేది. అదొక విచిత్రమైన వ్యాధి. అసలు చలిగాలి వారు సహించలేకపోయేవారు. అన్ని రుతువులలోను ఉన్ని బట్టలే ధరించవలసివచ్చేది. ఇలా వారు నాలుగేండ్లు గడిపారు.

చివరకు 1939లో నాగపూర్ సంఘచాలక్ బాబాసాహెబ్ ఘటాటేగారు బలవంతంచేస్తే నాసిక్ సమీపంలోని దేవలాలీలో గల వారి బంగళాలో విశ్రాంతి తీసుకోడానికి వెళ్ళారు. అప్పుడు వారికి డబుల్ న్యూమోనియా వ్యాధితో ఆరోగ్యం బాగా చెడిపోయింది. గురూజీ– అనగా మాధవరావు సదాశివరావు గోల్వాల్కర్ అహోరాత్రులూ చేసిన సేవా సుశ్రూషలవల్లనూ, అందరి శుభాకాంక్షలవల్లనూ తీవ్రమైన ఆ వ్యాధినుండి బయటపడి ఆరోగ్యంతో నాగపూరు చేరారు. అయితే ఆరోగ్యం బాగుపడిందన్న సంతోషం ఎంతో కాలం నిలువలేదు.




## అవకాశం చేజారి పోతోంది:

డాక్టర్‌జీ మనస్సులో ఆసమయంలో ఒక తుఫాను చెలరేగుతోంది. 1939లో రెండవ ప్రపంచయుద్ధం మొదలైంది. భరతమాత దాస్యశృంఖలాలను త్రెంచి పారవేయటానికి సువర్ణావకాశం అది. అయితే ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలిగిన జాతీయ శక్తి ఏముంది? అటువంటి మహాశక్తిని నిర్మాణం చేసేందుకే అప్పటివరకు డాక్టర్‌జీ అవిశ్రాంతంగా పనిచేశారు. కొంతమేరకు సఫలత పొందారు కూడా. అవసరాలను దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ శక్తి సరిపోదు. ఈ ఆలోచన డాక్టర్‌జీకి ఎంతో బాధ కలిగించేది. ఆరోగ్యం బాగు

చేయించు కొనేందుకు మిత్రుల సలహాను పాటించి బీహార్‌లోని రాజగీర్‌లో చికిత్సకోసం వెళ్లారు. అక్కడి ఉష్ణధారల క్రింద స్నానం చేస్తే అనేక మందికి బాధలు ఉపశమించాయి. డాక్టర్‌జీ ఇక్కడ ఉన్న రెండు మాసాలూ చికిత్సకోసం వచ్చినాకూడా సంఘకార్య విస్తరణ కృషికి విరామం యివ్వలేదు. నాగపంచమి ఉత్సవాలకు చందా అడగటానికి వచ్చిన విద్యార్థులతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని వారితో రాజగీర్‌లో సంఘశాఖను ప్రారంభించారు. ఇక్కడి చికిత్సవల్ల కొద్దిగా ప్రయోజనం కనిపించింది. కాని ఈ సమయంలో వారి మనస్సు ఎంతో ఆందోళనకు గురైయుందని అప్పాజీ జోషి వంటి పెద్దలు చెప్పుతుంటారు.

ఒకరోజు రాత్రి రెండు గంటల సమయంలో డాక్టర్‌జీ ప్రక్కమీద పడిఉన్నారు. నిద్రపట్టడంలేదు. మానసిక ఆందోళన కొనసాగుతూనే ఉంది. అప్పుడే మాగన్నుగా నిద్రపట్టింది. ఆస్థితిలో డాక్టర్‌జీ తనలో తాను మాట్లాడుకొంటున్నట్లుగా "చూడండి! చూడండి! అప్పుడే 1940 వచ్చేసింది. ఇంతవరకు మనం ఏమీచేయలేక పోయాం. ఇంకా మనం బానిసత్వం అనుభవిస్తూనే ఉన్నాం" అంటూ ఉండటం అప్పుడు అక్కడే ఉన్న అప్పాజీజోషి విన్నారు. దొరికిన అవకాశాలను స్వాతంత్ర్య ప్రాప్తి కొరకు సద్వినియోగం చేసుకోవడం ఎలా అని సుదీర్ఘంగా ఆలోచించిన తర్వాత అంచలవారీగా సంఘకార్యాభివృద్ధిని ఎలా సాధించాలో రాజగీర్‌లో ఉండగానే డాక్టర్‌జీ నిశ్చయించుకున్నారు. ఆ ఆలోచన ప్రకారం మూడు సంవత్సరాల కాలంలో పట్టణాల జనాభాలో మూడు శాతం, పల్లెల జనాభాలో ఒకశాతం గణవేషధారి స్వయంసేవకులు తయారు కావాలనుకొన్నారు. ఇందరు వ్యక్తుల ద్వారా నిర్మాణమైన శక్తిని ఆధారంగా చేసుకొని దేశంలో అతివేగంగా అనుకూలమైన పరివర్తన తేవచ్చునని దృఢంగా విశ్వసించారు. ఆ రోజుల్లో వారు చేసిన ప్రసంగాలలో 'యాచి దేహీ, యాచి డోళా' (ఈ ఒంటితో, ఈ కంటితో) అన్నమాటలు వినిపించేవి. అలా అనడం ఈ శరీరం ఉండగానే, ఈ కళ్ళతోనే దేశంలో పరివర్తన వచ్చిన దృశ్యాన్ని చూడాలనే ఆకాంక్ష స్వయంసేవకులలో జాగృతం చేయాలనే! వారి ప్రయత్నాలన్నీ ఆ రీతిలోనే సాగేవి.

## ఇక వారు కనిపించరని ఎవరూహించారు?

1940 ఏప్రిల్ మాసం వచ్చింది. పూనాలో జరుగుతున్న 40 రోజుల శిక్షణ తరగతులను గూర్చి డాక్టర్‌జీ ఆలోచించసాగారు. రాజగీర్ నుంచి నాగపూర్ వచ్చీరావటంతోనే పూనాకు బయలుదేరి వెళ్ళారు. ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉంది. అయినా పూనా శిక్షణశిబిరంలోని అన్ని కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొని

నిర్వహించారు. స్వయంసేవకులు అందరితో వ్యక్తిగతంగా పరిచయం చేసుకొన్నారు. వెన్ను పూస బాధపెడుతూనే ఉండేది. మండువేసవి రోజులైనా వారికి చల్లదనం పనికొచ్చేది కాదు. అందుచేత ఉన్ని బట్టలనే ధరించేవారు. అయినా పూనాలో ఉన్న 15 రోజులూ కార్యక్రమాలలో పాల్గొంటూనే ఉన్నారు. ఎవరికీ తమ అనారోగ్యం సంగతి తెలియనీయలేదు ఆ శిక్షణ తరగతులలో వారు నాలుగు ఉపన్యాసాలిచ్చారు. చివరి రోజు ముగింపు ఉత్సవం సందర్భంగా ఏర్పాటైన కార్యకర్తల ప్రాంతీయ సమావేశంలో కుర్చీలో కూర్చొనే రెండు గంటల సేపు మాట్లాడారు. ప్రతి ఉపన్యాసంలోనూ ఆవేదన వెలిబుచ్చుతూ దేశానికి తరుణోపాయం సంఘం ఒక్కటే అన్న దృఢవిశ్వాసం వ్యక్తంచేశారు. పట్టణాలలో మూడుశాతం, గ్రామాలలో ఒక శాతం లక్ష్యాన్ని మూడు సంవత్సరాలలో సాధించగలమన్న ఉత్సాహం స్వయంసేవకులకు కల్గించారు. పూనా శిబిరం పూర్తయ్యింది. స్వయంసేవకులనుండి ప్రేమ పూర్వకమైన వీడ్కోలు లభించింది. వీడ్కోలు అయితే జరిగింది కాని అదే అంతిమ వీడ్కోలు అవుతుందని ఎవరు ఊహించగలిగారు?

డాక్టర్‌జీ నాగపూర్‌లో జరుగుతున్న శిక్షణశిబిరానికి వచ్చారు. శిక్షణ శిబిరంలోనే ఉండే ఏర్పాటు జరిగింది. కానీ ఆరోజే వారికి తీవ్రమైన జ్వరం వచ్చింది. ఇంటికి వచ్చేశారు. నాగపూర్ నగరంలో సంఘశిక్షణ శిబిరం జరుగుతూ ఉండటం, అందులో పాల్గొనకుండా డాక్టర్‌జీ మంచంమీద పడి ఉండటం సంభవమా! కాని అదే జరిగింది. డాక్టర్‌జీ తాళలేకపోయారు. జ్వరం వదలిపెట్టలేదు. డాక్టర్‌జీ వసతిని బాబాసాహెబ్ ఘటాటే ఇంటికి మార్చారు. ఒక ప్రక్క వ్యాధితో పడుతున్న బాధ కొనసాగుతూ ఉండగానే శిక్షణ శిబిరం అయిపోతూ వచ్చింది. వారు అలా రోగపీడితులై బాధపడుతున్న సమయంలోనే డాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ వచ్చి కలుసుకొన్నారు. సంఘాన్ని క్రియాత్మక రాజకీయాలలో పాల్గొనేటట్లు చేయవలసిందని శ్యామప్రసాద్ ముఖర్జీ ఇచ్చిన సలహాను డాక్టర్‌జీ అంగీకరించలేదు. రెండవ



ప్రపంచయుద్ధానికి సంబంధించిన సమాచారం, ముస్లింలీగ్‌వారు ప్రతిపాదించిన పాకిస్తాన్ ప్రస్తావన వారిలో అశాంతిని రేకెత్తించాయి. ఎప్పుడూ ఆ ఆలోచనలే మెదడును కొరుక్కు తింటుండేవి. దేశంలోని అన్ని ప్రాంతాలనుండి అధిక సంఖ్యలో శిక్షణకొరకు వచ్చిన శిక్షార్థులను కలుసుకోలేకపోయినందుకు ఆయన హృదయం పరితపించింది. అంతతీవ్రమైన వ్యాధితో బాధపడుతూకూడా శిక్షణశిబిరం చివరిలో జరిగే సార్వజనికోత్సవానికి హాజరవుతానని పట్టుపట్టారు. కాని వైద్యులు అందుకు అనుమతించలేమన్నారు. చివరికి జూన్ 9వ తేదీన ఉదయం జరిగే స్వయం






సేవకుల వీడ్కోలు కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు. అందుకు తగిన శక్తి ఆయనకు ఎక్కడినుండి వచ్చిందో ఆ పరమేశ్వరుడికే ఎరుక. ఎన్నటికీ మరువలేని ప్రసంగం అది. స్వయంసేవకుల హృదయాలను స్పందింపచేసి సంఘకార్యానికి మించిన ఉత్తమ కార్యం జీవితంలో మరేదీ ఉండదన్న సందేశాన్ని ప్రసాదించిన ప్రసంగం అది. భారమైన హృదయంతో స్వయంసేవకులు ఆ ప్రసంగాన్ని ఆలకించారు. 'మీకు ఏమాత్రం నేను సేవచేయలేకపోయాను' అని డాక్టర్‌జీ అంటున్నప్పుడు స్వయంసేవకులు నీళ్ళునిండిన కళ్ళతో నిర్వేదం అనుభవించారు.

## మహాప్రస్థానం:

ఆ తర్వాత పన్నెండు రోజులకే డాక్టర్‌జీ ఆత్మ శరీరాన్ని వదలి అనంతవాయువులో లీనమైంది. అంతకుముందు– ఇవ్వవలసిన మందులన్నీ ఇచ్చారు. వెన్నుపూస నొప్పికి కారణం మాత్రం తెలియలేదు. చివరికి 'లంబర్ పంచర్' (వెన్నెముకలోని ద్రవాన్ని తీయటం) చేయాలని నిర్ణయించారు. అప్పుడు డాక్టర్‌జీ గురూజీని దగ్గరకు పిలిచారు. 'ఇక సంఘం బాధ్యత మీ భుజాలమీద ఉన్నది' అని






అందరి ఎదుట అన్నారు. తనజీవితం పూర్తి కావస్తున్నదనీ, భవిష్యత్తుగురించిన ఏర్పాట్లు చేయాలనీ ఆయన గుర్తించారు. తమ నిర్ణయాన్ని గురూజీకి తెలియజేసి అంతిమయాత్రకు సిద్ధమైనారు. చివరకు జూన్ 21 ఉదయం 9 గంటల 27 నిముషాలకు డాక్టర్‌జీ ఆత్మ అనంతాకాశంలో కలిసి పోయింది. అది కలియుగాబ్ది 5042 (క్రీ.శ. 1940).




ఆవార్త విద్యుత్ వేగంతో నలువైపులా వ్యాపించింది. బాబాసాహెబ్ ఘటాటే బంగళా ఎదుట స్వయంసేవకులూ, పౌరులూ గుమికూడ సాగారు. గ్రామ గ్రామాలనుంచీ కార్యకర్తలూ, స్వయంసేవకులూ వచ్చారు. అంతిమ యాత్ర సుమారు ఒక మైలు పొడవుంది. అనేకుల కళ్ళనుండి అశ్రుధారలు వెలువడుతున్నాయి.

తనకంటూ కుటుంబాన్ని ఏర్పరచుకోకుండా తన సర్వస్వాన్ని జాతికర్పించిన ఆ మహాపురుషుని అంతిమ దర్శనంకోసం ప్రజలు అసంఖ్యాకంగా వచ్చి చేరుతున్నారు. ప్రకృతి మాత కన్నీరు విడిస్తున్నదా అన్నట్లు వర్షపు జల్లు ప్రారంభమైంది. డాక్టర్‌జీ సంఘం కోసం రేశంబాగ్‌లో ఒక స్థలం కొని ఉన్నారు. అక్కడ అగ్ని సంస్కారం జరిగింది. ఆ తపో భూమిపైనే ఇప్పుడు భవ్యమైన స్మృతి మందిరం నిలిచివుంది.



తన శరీరాన్ని గంధపుచెక్కవలె అరగదీసి తన 52వ ఏట, అంటే సంఘాన్ని స్థాపించిన 15 సంవత్సరాలకు ఆయన మహాప్రస్థానం చేశారు. మృత్యుదేవత పిలుపు అందరికీ వచ్చేదే. అయితే డాక్టర్‌జీ మరణించికూడా కీర్తికాయులై అమరులైనారు. తన జీవితకాలంలో ఏర్పరచిన గట్టి పునాదిమీద కార్యకర్తల బృందాన్ని నిర్మాణం చేశారు. గురూజీ వంటి కార్యశూరుని భుజాలపైన సంఘబాధ్యతను మోపి వెళ్ళిపోయారు. ఇది జరిగి ఇప్పటికి 48 సంవత్సరాలైంది. డాక్టర్‌జీ మన మధ్యలేనప్పటికీ, ఆయన వెలిగించిన ఆదర్శమనే జ్యోతి నేటికీ వెలుగు తగ్గలేదు. అనేక ఇతర సంస్థలవలె సంఘం చప్పబడలేదు. ముక్కలు కాలేదు. డాక్టర్‌జీయే సంఘరూపంలో నిలిచిపోయారు. అదే ఆయన కీర్తి పతాక.

# 4

సంఘకార్యం జాతీయ కార్యం. జాతి జీవనంలో ప్రతిరంగంలోనూ సంఘ స్వయంసేవకులు చొచ్చుకొనిపోయి పనిచేయాలన్నదే డాక్టర్‌జీ ఆశయం. సంఘంలో స్ఫూర్తి పొందిన కార్యకర్తలు ఏ రంగంలో పనిచేసినా విజయం సాధించి తీరుతారన్నది డాక్టర్‌జీ విశ్వాసం. ఆ విశ్వానికి తగినట్లే సంఘం శాఖోపశాఖలుగా విస్తరించింది.

## వటవృక్షమైన సంఘకార్యం:

1925లో విజయదశమినాడు జరిగిన సంఘస్థాపన ఘట్టం ఆధునిక భారతదేశ చరిత్రను మలుపుత్రిప్పిన ఒక మహాసంఘటన. ఆ విజయదదశమి వరకు హిందుత్వం గురించి మాట్లాడినవారు పలువురున్నారు. హిందూరాష్ట్ర సిద్ధాంతాన్ని గురించిన ఆలోచనకూడా జరిగింది. కాని హిందువుల సంఘటిత శక్తికి ఒక రూపం ఇచ్చే మార్గాన్ని ఎవరూ కనుగొనలేదు. ఆ ఆలోచనను అమలుచేసేందుకు బలమైన ఆధారాన్ని అందించారు డాక్టర్‌జీ. హిందువులలో కానవచ్చే వైవిధ్యంలో ఇమిడిఉన్న ఏకతా సూత్రాన్ని చేపట్టి, ఆ సూత్రం ఆధారంగా వారిని స్నేహబంధంలో కలిపే ప్రత్యక్ష ప్రయోగం జరిపిన వ్యక్తి డాక్టర్‌జీ ఒక్కరే. ప్రతిక్రియ రూపంలో కాకుండా విశుద్ధ జాతీయతను దర్శించి ఆచరణలో చూపేందుకు తగిన కృషి చేసిన వారు డాక్టర్‌జీ.

సంఘంనేడు దేశమంతటా విస్తరించింది. 1947 తరువాత మారిన పరిస్థితిలో సంఘకార్యకర్తలు వివిధ జీవనరంగాలలో ప్రవేశించారు. జాతీయభావాల

వైపు సమాజాన్ని మలుపుత్రిప్పే పనిలో ఉత్సాహంగా పాల్గొంటున్నారు. హిందూ రాష్ట్రం, హిందూ సంస్కృతిపట్ల శ్రద్ధతో, ఆత్మవిశ్వాసంతో ఈ సమాజం చైతన్యవంత మవుతోంది. 20 వేల గ్రామాలలో నడుస్తున్న సంఘశాఖలలోని లక్షలాది స్వయంసేవకులు డాక్టర్‌జీ కలలుకన్న సమర్థవంతమైన హిందూ సమాజాన్ని రూపొందించడం కోసం ఆయన మరణించిన 48 సంవత్సరాల తరవాతకూడా నిరంతరంగా కృషిచేస్తున్నారు. తన ధ్యేయాన్ని కనుమరుగు కానీయకుండా ఇంతకాలం నిరంతరంగా పెరుగుతున్న సజీవ సంస్థ మరొకటి కనబడదు. డాక్టర్‌జీ కార్యశూరతకూ, అద్భుతమైన ఆయన సంఘటనాసామర్థ్యానికీ ఇదే నిదర్శనం.

## వట్టిమాటలుకాదు గట్టిచేతలు కావాలి:

డాక్టర్‌జీ హిందూ తత్వశాస్త్రంపై పండిత చర్చకు దిగలేదు. కోట్ల సంఖ్యలో ఉన్న హిందూ సమాజం కళ్ళముందు కనబడుతోంది. ఈ దేశ యజమాని హిందువు; ఈ భావన ఆధారంగా హిందువులను ఏకంచేద్దాం– ఇదీ ఆయన ఇచ్చిన పిలుపు. సంఘటన ఎలా జరపాలో ఆయన వివరించేవారు. వారి మాట సూటిగా గుండెల్లో నాటేలా ఉండేది. 'ఏ పని అయినా చేస్తేనే అవుతుంది కనుక పనిచేయాలి' అన్నది ఆయన మంత్రం. ఈ మంత్రం ప్రకారం సంఘటనను నిర్మించటం కోసం ఆయన విరామం లేకుండా నిరంతరంగా శ్రమించారు. సాటిలేని నిగ్రహంతో, ఆత్మీయతతో, అణకువతో, ఆత్మవిశ్వాసంతో, నిరహంకారంతో ఆయన తన భావాలను ప్రచారంచేశారు. నవయువకుల జీవితాలను తీర్చిదిద్దారు.

## జాతీయ పునరుజ్జీవనానికి అగ్రగామి :

హిందుత్వాన్నిపెంచి పోషించే సంస్థనూ, హిందూధర్మ సంస్కృతుల రక్షణను వ్రతంగా పూనిన సంస్థనూ, జాతీయశీలం కావాలని నొక్కివక్కాణించే సంస్థనూ డాక్టర్‌జీ నిర్మించి ఉండకపోతే గత 40 సంవత్సరాలలో ఏమి జరిగి ఉండేదో ఊహించడం కష్టం. నేడు సంఘం అన్ని వర్గాలలోనూ ప్రవేశించింది. సంఘం నుండి ప్రేరణ పొందిన కార్యకర్తలు వివిధ రంగాలలోనికి దూసుకుపోయి ఆయారంగాలను విశుద్ధ జాతీయ భావనలతో నింపడానికి విజయవంతంగా కృషి చేస్తున్నారు. అందువల్ల సంఘభావాల తరంగాలు సమాజంలో దూరతీరాలకు వ్యాపిస్తున్నాయి. జాతీయ వ్యతిరేక విధానాలకూ, చర్యలకూ విరుద్ధంగా, జాతికి ప్రయోజనం చేకూర్చే కార్యకలాపాలకు మద్దతుగా తన గొంతువిప్పే హిందూ

చైతన్యం దేశమంతటా కానవస్తోంది. సంఘం తీసుకొన్న జాతీయవాద సిద్ధాంతాన్నీ కార్యపద్ధతినీ మొదట్లో కొందరు ఎగతాళి చేశారు. ఆసిద్ధాంతానికే, ఆ కార్యపద్ధతికే నేడు గౌరవం లభిస్తోంది. మంచి సంస్కారం, అనుశాసనం కలిగిన కార్యకర్తల బృందం సంఘానికి ఉన్నట్లు తమకు లేదని పలువురు నాయకులూ, పలుసంస్థలూ, పార్టీలు అసూయ పడుతున్నాయి. సంఘంలోని కార్యపద్ధతి యొక్క బాహ్యరూపాన్ని అనుకరించటానికి పలువురు ప్రయత్నించి విఫలమైనారు కూడా.

హిందూ శబ్దం విషయంలో కూడ సంకోచంపోయి అభిమానం, గౌరవం చోటు చేసుకొంటున్నాయి. "మేము హిందువులం. హిందూ సమాజ రక్షణకై నడుంబిగించి నిలబడ్డాం" అని చాటిచెప్పే సంస్థలు నేడు ప్రతిచోటా కనబడుతున్నాయి. ఈ మార్పు కళ్ళకు కట్టినట్టు కనబడుతోంది. ఈ విధంగా సంఘం జాతీయ పునరుజ్జీవనానికి అగ్రగామి అని ఋజువైంది.

### అమరభారతం :

భారతదేశ చరిత్రలో ఆటుపోటులు మనకు పదేపదే కనిపిస్తాయి. అయితే ప్రపంచంలో అనేక జాతులు తమ సంస్కృతితో సహా పతనమైనాయి. మళ్లీ తలఎత్త లేక పోయాయి. కాని భారతదేశం మాత్రం పతనం చెందిన ప్రతిసారీ తిరిగి తల ఎత్తుకొన్నది. ప్రాచీనమైన ఈ జాతి అమరత్వాన్ని వరంగా పొంది జన్మ ఎత్తింది. ఇందులో ఉన్న రహస్యాన్ని డాక్టర్‌జీ కనుగొన్నారు. ఏజాతి అయినా స్వతంత్రంగా, వైభవంగా బ్రతకాలంటే ధర్మసంస్కృతుల పరిరక్షణను అన్నిటినీ మించిన పనిగా భావించవలసి ఉంటుంది — ఇదే ఆ రహస్యం. సంఘ ప్రతిజ్ఞలోనూ, ప్రార్థనలోనూ ఆయన ఈమాటలను పొందుపరచారు. "మన పవిత్ర హిందూ ధర్మమునూ, హిందూ సంస్కృతినీ, హిందూ సమాజమునూ సంరక్షించి, హిందూ రాష్ట్రమును స్వతంత్రమును చేయుటకు" — అని *ప్రతిజ్ఞలో ఉంది. 'విధాయాస్య ధర్మస్య సంరక్షణం' (ఈ ధర్మమును సంరక్షించి), 'పరంవైభవన్నేతు మేతత్స్వ రాష్ట్రం (స్వరాష్ట్రముయొక్క పరమవైభవస్థితిని సాధించుటకు) అని ప్రార్థనలో సంకల్పం జరిగింది. ధర్మం భారత దేశానికి ఊపిరి అని స్వామి వివేకానంద ఆనాడే ఎలుగెత్తి చాటారు. ఈ దేశంలో మేలుకొలుపునకు జరిగిన ప్రయత్నాలన్నీ ధర్మం ఆధారంగా

---

*స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రతిజ్ఞలో 'హిందూ రాష్ట్రమును స్వతంత్రం చేయుటకు' బదులుగా 'హిందూ రాష్ట్రము యొక్క సర్వాంగీణ ఉన్నతిని సాధించుటకు' అని చేర్చబడింది.

జరిగినవే. ధర్మరక్షణ కోసం జరిగినవే. ఆధ్యాత్మిక వేత్తలైన మహాపురుషులు ధర్మగ్లానిని తొలగించినపుడే ఈ దేశం వైభవ శిఖరాలను అందుకొన్నది.

## దేశధర్మాలమధ్య విడనిముడి :

మనదేశ చరిత్రనూ; దేశవైభవానికీ, పతనానికీ గల కారణాలనూ డాక్టర్‌జీ లోతుగా పరిశీలించారు. ఈ దేశంలో ప్రతిసారీ ముందు ఆధ్యాత్మికంగా మేలుకొలుపు జరిగింది. ఆ తర్వాతనే భౌతిక జీవనం మెరుగు పడింది. ఎన్నో ఉదాహరణల ద్వారా ఈ సత్యం ఆయన దృష్టికి వచ్చింది. బుద్ధ భగవానుడు ధర్మ జాగరణ చేశాడు. ఆ తర్వాత మౌర్య సామ్రాజ్యం ఏర్పడింది. ఆది శంకరులు వైదిక ధర్మం యొక్క విజయ పతాకను అన్ని వైపులా ఎగరేశారు. ఆ తర్వాత స్వర్ణయుగం వచ్చింది. మాధవ విద్యారణ్య స్వామి చేసిన ధార్మిక జాగరణ ఆధారంగా విజయనగర సామ్రాజ్యం సిరిసంపదలతో తులతూగింది. జ్ఞానేశ్వర్ నుంచి సమర్థ రామదాసు వరకూ సాధుసంతులు మహారాష్ట్రలో ధార్మిక జాగరణ సాగించారు. ఛత్రపతి శివాజీ మహారాజు నాయకత్వం దేశానికి లభించింది. గురునానక్ పంజాబులో ఆధ్యాత్మిక జ్యోతిని వెలిగించారు. ధర్మరక్షణ కోసం ఆయుధాలు చేపట్టాలనే ప్రేరణ చివరి అయిదుగురు గురువులకు ఆయన నుండి లభించింది. ఆకారణంగా — హిందూ ధర్మ రక్షణ కోసం ముస్లిం దురాక్రమణదారులతో జరిగిన యుద్ధాలలో మహత్తర త్యాగ, బలిదానాలతో నిండిన క్రొత్త పుట చరిత్రలో తెరుచుకొన్నది.

దయానందమహర్షి, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, స్వామిరామతీర్థ, యోగి అరవిందులు, రమణ మహర్షి వంటి ఆధ్యాత్మిక విభూతులు జాతిలోని జీవశక్తిని మేలుకొలిపారు. జాతిలో చైతన్యం పొంగిపొరలింది. ఫలితంగా స్వాతంత్ర్యోద్యమం ఉదయించింది. ఆ ఉద్యమానికి 'వందే మాతరం' మహామంత్రం అయింది.

## సంఘకార్యం దైవకార్యం :

డాక్టర్‌జీ ఈ జీవనాడిని పట్టుకొన్నారు. ధర్మసంస్కృతుల రక్షణకు స్వాతంత్ర్యం, సంఘటన, శక్తి తప్పనిసరిగా ఉండాలని చెప్పారు. దీనికోసం మనుషులను కలపడం, వారిని సంఘటనగా తీర్చిదిద్దటం తన జీవన కార్యంగా చేసుకొన్నారు. మహాపురుషులు చూపిన ఆదర్శాలను సఫలంచేయడానికి అనుకూల పరిస్థితిని నిర్మించడమే ఈ పని యొక్క అసలు ఉద్దేశ్యం. సంఘప్రతిజ్ఞలో, ప్రార్థనలో,

డాక్టర్‌జీ ప్రసంగాలలో ఈ లక్షణం అడుగడుగునా కనిపిస్తుంది. ప్రతిజ్ఞలో ప్రారంభంలోనే సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని స్మరణ ఉంది. ప్రార్థనలో పరమేశ్వరుని శుభాశీస్సుకోరబడింది. 'త్వదీయాయ కార్యాయ బద్ధాకటీయం' — నీపని కోసమే మేము నడుం బిగించాము — అని స్వయంసేవకులు అందరూ ప్రార్థన ద్వారా పరమేశ్వరుని ముందు ఈ నిశ్చయాన్నే మళ్ళీ ప్రకటిస్తున్నారు. అభ్యుదయ నిఃశ్రేయసులు — అనగా భౌతిక ఆధ్యాత్మిక ఉన్నతులు రెండూ అవసరమేనని హిందూ ధర్మం చెప్తోంది. ప్రార్థనలో 'పరం వైభవం' అనే చోట దీన్ని పేర్కొన్నారు. 'మన పని దైవకార్యం', 'సంస్కృతియే జాతికి ఆత్మ' — ఇటువంటి మాటలు డాక్టర్‌జీ ప్రసంగాలలో అడుగడుగునా వచ్చాయి. సంప్రదాయానికి దూరమైన ఆలోచన దేనినీ డాక్టర్‌జీ ప్రకటించలేదు. అయితే — కొన్నికొన్ని ఆచారాలలో మూలసూత్రాలు మరుగున పడినప్పుడు ఆయన ఆసూత్రాలను గుర్తు చేశారు.

ఉదాహరణకు — 'సంభవామి యుగే యుగే' అని భగవద్గీతలో కృష్ణపరమాత్మ చేసిన వాగ్దానాన్ని చూసి అవతారాల కోసం ఎదురు చూసే వారికి ఆయన ఇలా బోధించేవారు. "భగవంతుడు అవతరించేది సాధువులన్నూ, సజ్జనులనూ రక్షించడానికి. మరి మనం నిజంగా సజ్జనులమేనా? సమాజం గురించీ, ధర్మ సంస్కృతుల గురించీ ఆలోచించని వారూ, స్వార్థంతప్ప మరొకటి తోచనివారూ సాధువులు ఎలా అవుతారు? దుర్మార్గులే అవుతారు. ఈ చెడ్డ గుణాలు మనలో ఇలా మిగిలి ఉన్నంతవరకూ - మనం ఎంత వేడుకున్నా ఆయన దయ చూపడు, మన సహాయానికి పరిగెత్తుకు రాడు. దేశధర్మముల కోసం మనకున్నదంతా త్యాగం చెయ్యడానికి మనం సిద్ధపడినప్పుడు మాత్రమే భగవంతుడు మనల్ని సజ్జనులుగా గుర్తించి మనకోసం పరుగున వస్తాడు". మనిషిని కుదిపివేసి అతనిలో కర్తవ్య భావనను మేల్కొలిపే ఆలోచనలు ఈ విధంగా డాక్టర్‌జీ మాటలలో వ్యక్తమయ్యేవి. సంఘం క్రొత్తపని ఏదో చేస్తుందనే అహంకారం ఆయన సంఘంలో ఎన్నడూ ఏర్పడ నివ్వలేదు. ధర్మసంస్కృతులను రక్షించడమనే మహత్తర ఆశయంనుంచి స్వయం సేవకుల దృష్టిని ఎన్నడూ తొలగనివ్వలేదు.

## కావలసింది శీలసంపద:

డాక్టర్‌జీ పుట్టిననాటినుంచీ 1920లో లోకమాన్య తిలక్ చనిపోయేవరకూ జరిగిన కాలంలో కార్యశూరులైన మహాపురుషులు ఎందరో ఈ దేశంలో

ఉదయించారు. సౌశీల్యానికి, ఆదర్శాలకు ప్రాణంకన్నా హెచ్చు విలువ ఇచ్చే మహా వ్యక్తుల వ్యక్తిత్వాలను ఆయన చూచారు. ఆ సమయంలోనే స్వామి వివేకానంద ఇలా సింహ గర్జన చేశారు. "ప్రపంచాన్ని చూడు. పాశ్చాత్యుల సంఘటన కౌశలాన్ని ఉత్సాహ శక్తిని, అనుశాసనాన్ని తప్పకుండా నేర్చుకో అయితే - మన జాతికి ప్రాణమైన ఆధ్యాత్మికతను, ధర్మాన్ని నిలిపి ఉంచుకోకపోతే - భోగాలకు విలువనిచ్చే పాశ్చాత్య జీవితాన్ని అనుకరించే మోజులో మన శీలసంపద నాశనం అవుతుంది".

మచ్చలేని శీలం ఎంత విలువైనదో డాక్టర్‌జీ స్వయంసేవకులకు మనస్సులలో నాటుకునేవిధంగా బోధించేవారు. సెగలు క్రక్కే దేశభక్తి ఆత్మగౌరవం, ఏకాగ్రత, నమ్రత, సౌజన్యం, సేవాభావం, స్నేహశీలత, సమాజ బంధువుల కష్ట సుఖాలను పంచుకునే లక్షణం, తోటివారిపట్ల సహనం, మచ్చలేని శీలంవంటి గుణాల కారణంగా డాక్టర్‌జీ వ్యక్తిత్వం సంస్కారాలను అందించేదిగా రూపొందింది.

నాగపూర్ ప్రజాజీవనంలో ఆయన తరచు డాక్టర్ మూంజేకి మద్దతు నిచ్చేవారు. డాక్టర్‌జీ శీలంలో మచ్చచూపటం తమవల్ల కాలేదని డాక్టర్ మూంజే ప్రత్యర్థులు స్వయంగా ఒప్పుకొన్నారు. డాక్టర్ మూంజేకు బద్ధ విరోధి అయిన బారిష్టర్ అభ్యంకర్ నుంచి ఒకసారి డాక్టర్‌జీ ఆపదలోనున్న తన స్నేహితుని ఆదుకొనటానికి అప్పు తీసుకొన్నారు. ప్రామిసరి నోట్ వ్రాసి ఇస్తామన్నారు. "డాక్టర్ హెడ్గేవార్‌నుంచి ప్రామిసరి నోట్‌ను వ్రాయించుకొనేటంత పిచ్చి నాకింకా పట్టలేదు" - అన్నారు బారిష్టర్ అభ్యంకర్ అందుకు సమాధానంగా. స్వయంసేవకులు ఎట్టి పరిస్థితులలోను తమ శీలానికి మచ్చ రాకుండా శ్రద్ధ తీసుకోవాలని నొక్కి చెప్పేవారు డాక్టర్‌జీ.

## *డాక్టర్‌జీ తర్వాత.................*

డాక్టర్‌జీ సంఘాన్ని గురూజీవంటి యువసహచరునికి అప్పగించారు. గురూజీ ప్రజాహిత రంగంలో అనుభవం ఉన్నవారు కాదు. ఆధ్యాత్మికత ఆధారంగా జీవితం గడిపిన వ్యక్తి. అందువల్ల ఈ ఎంపిక డాక్టర్‌జీ మిత్రులు, ప్రజాహిత రంగంలో అనుభవం గడించిన వారు అయిన పలువురికి ఆశ్చర్యం కలిగించింది. 1939 లోనే డాక్టర్‌జీ తన ఆరోగ్య పరిస్థితిని గమనించి సంస్థకు చేయదగిన ఏర్పాట్లను గురించి ఆలోచించారు. అందుకోసం కొందరు సహచరుల అభిప్రాయాలు తెలుసు కొన్నారు. 1939 లో వర్ధా జిల్లా సిందిలో ప్రత్యేక సమావేశం ఒకటి జరిగింది. ఆ సమయంలో గురూజీకి సర్‌సంఘచాలక్ బాధ్యతను అప్పగించాలనే ఆలోచన డాక్టర్‌జీ

మనస్సులో స్థిరపడి ఉండవచ్చు. జీవితమంతా డాక్టర్‌జీ సహచరులుగా ఉన్న వర్ధా జిల్లా సంఘచాలక్ అప్పాజీ జోషి ఈ విషయం చెప్పారు. భావి సర్‌సంఘచాలక్‌గా గురూజీ మీకెలా అనిపిస్తారని డాక్టర్‌జీ అప్పాజీని అడిగినప్పుడు అప్పాజీ గురూజీ గుణగణాలను ప్రశంసించారు. 1939 నుంచి చివరి అనారోగ్యం వరకు డాక్టర్‌జీ గురూజీ ఆలోచనలను, చర్యలను ఎంతో నిశితంగా పరిశీలించారన్న మాట నిజం.

గురూజీకి ఆధ్యాత్మికతవైపు మొగ్గు ఉన్నదన్న సంగతి డాక్టర్‌జీకి తెలును. గురూజీ ఎవ్వరికీ చెప్పకుండా సార్‌గాఛీలోని రామకృష్ణ పరమహంస శిష్యులైన స్వామి అఖండానందజీ ఆశ్రమానికి వెళ్ళిపోయిన సంఘటన డాక్టర్‌జీ కళ్ళముందర జరిగినదే. అయినా - అఖండానందజీ మహాసమాధి అనంతరం గురూజీ నాగపూర్ వచ్చినప్పుడు డాక్టర్‌జీ ఎంతో ప్రేమతో, ఎంతో స్నేహంతో ఆయనను దగ్గరికి తీసుకొన్నారు. సంఘంవనిలో ఆయనకు మరింతగా బాధ్యతలు అప్పగించారు. సర్‌కార్యవాహ (ప్రధానకార్యదర్శి) బాధ్యతను అప్పగించారు. తన సమక్షంలో ఉపన్యాసం




యిచ్చే అవకాశాన్ని ఆయనకు కల్పించారు. సంఘశిక్షావర్గ (శిక్షణ శిబిరం)కు సర్వాధికారిగా నియమించారు. కార్యవిస్తరణకోసం ఆయనను పర్యటనలకు పంపారు. కేవలం 3 సంవత్సరాల కాలంలోనే గురూజీ సంఘకార్యంలో పూర్తిగా లీనమైనారు. సంఘకార్యమే దైవకార్యమనే విశ్వాసం ఆయన మనసులో గట్టిపడింది.

## *ఎంపికలో ఎంతటి దూరదృష్టి !*

డాక్టర్‌జీ సమయజ్ఞతకూ, దూరదృష్టికీ నిదర్శనం ఈ ఎంపిక. 1940 నుంచి 1973 వరకూ 33 సంవత్సరాలపాటు గురూజీ సర్‌సంఘచాలక్ బాధ్యతను

నిర్వహించారు. ఈ కాలంలో ఆయన చూపిన కార్యశూరత, కార్యవిస్తరణలో ఆయన తెచ్చిన వేగం అందరికీ తెలిసినదే. ఆయన సంఘాన్ని బలీయమైన శక్తికేంద్రంగా వికసింప చేశారు. మిత్రులు, శత్రువులు అందరు సంఘాన్ని గురించి ఆలోచించి తీరవలసి వచ్చేటంతగా వికసింపజేశారు. ఆయన సంఘాన్ని ప్రతి జిల్లాకు తీసుకు వెళ్ళారు అంతేకాదు తాము హిందువుల మయినందుకు గర్వించే లక్షణాన్ని సామాన్య మనుష్యులలో కలిగించారు. సంఘకార్యం దేశమంతటా విస్తరించిన కారణంగా, సంఘం వివిధ రంగాలలోని మేధావుల దృష్టిని ఆకర్షించిన ఫలితంగా - గురూజీ సంఘ సిద్ధాంతాన్ని అనేక రీతులలో, అనేక స్థాయిలలో ప్రతిపాదించవలసి వచ్చింది. ఆయన పెద్ద ఎత్తున ప్రజలను కలునుకొన్నారు. వివిధ స్థలాలతో, వ్యక్తులతో ఆత్మీయతతో నిండిన సంబంధాలు ఏర్పరచుకొన్నారు. పెద్దసంఖ్యలో ప్రచారకులుగా రావడానికి యువకులకు ప్రేరణనిచ్చారు. 1940 నాటికి గురూజీ సంఘంలో తప్ప దేశంలో దాదాపు అపరిచితులే. కానీ ఆ తర్వాత కాలంలో లక్షలాది ప్రజలు ఆయన ఉపన్యాసాలు వినడానికి వచ్చేవారు. ప్రముఖ వ్యక్తులు ప్రత్యేక సమస్యలపై ఆయన అభిప్రాయం తెలునుకొనడానికి కుతూహల పడేవారు.

ఆ విధంగా గురూజీ ప్రజల మనసులలో స్థానం సంపాదించారు. సంఘ భావతరంగాలను కోనకోనకూ ప్రసరింపజేశారు. హిందూ రాష్ట్ర సిద్ధాంతాన్ని నిర్భయంగా ప్రభావం కలిగించే విధంగా ప్రతిపాదించారు. ఈనాటి ప్రపంచం, ఈ ప్రపంచంలో ఉదయించిన క్రొత్త క్రొత్త సిద్ధాంతాలూ, శాస్త్రాలు అన్నింటిగురించి వారికి తాజా పరిజ్ఞానం ఉండేది. హిందూ ధర్మాన్ని సంస్కృతిని, జీవనవిధానాన్ని ఆయన లోతుగా అధ్యయనం చేశారు. కనుకనే - ప్రపంచ సమస్యలను పరిష్కరించే సామర్థ్యం హిందూ సిద్ధాంతానికి, హిందూ జీవన దృక్పథానికి ఉన్నదని ఆయన ఆత్మ విశ్వాసంతో ప్రకటించేవారు. తక్కువచూపుతోకాని దెబ్బ తీయాలనే కోరికతో గాని - 'హిందూ', 'హిందూరాష్ట్రం' అనే పదాలను విమర్శించే వారికి తగువిధంగా జవాబు చెప్పి గురూజీ హిందూ సమాజంలో ఆత్మగౌరవ భావాన్ని పెంచారు.

కాగా - డాక్టర్‌జీ సమయంలో ఉన్న పరిస్థితికీ, గురూజీ సమయంలో ఉన్న పరిస్థితికీ తేడా ఉంది. బలహీనతలవల్ల, తనను తాను మరచినందువల్ల, సంఘటన లోపించినందువల్ల హిందూ సమాజానికి ఎలాంటి ప్రమాదం వస్తుందని డాక్టర్‌జీ ఊహించారో ఆ ప్రమాదం గురూజీ సమయంలో వచ్చిపడింది. డాక్టర్‌జీ మరణం తర్వాత ఏడు సంవత్సరాలపాటు శాఖల విస్తరణకై పెద్ద యెత్తున ఉద్యమం నడిపారు. స్వయంసేవకులను ఈ పనిలో పూర్తిగా నిమగ్నమయ్యేలట్లు చేశారు. కాని

బ్రిటిష్‌వారి కుటిలనీతి, ముస్లింలీగ్ అనుసరించిన హింసా రాజకీయం, మరియు ముస్లింల సంతుష్టీకరణలో, పదవులవేటలో మునిగి ఆత్మవిశ్వాసం కోల్పోయిన కాంగ్రెసు - ఈ మూడూ కలిసి దేశవిభజనకు నిర్ణయించాయి. దేశ విభజన జరుగనీయమని జాతికి ఇచ్చిన మాటను తప్పి కాంగ్రెసు నాయకులు గూండా చర్యలకు లొంగిపోయారు. విభజనకు గురైన ప్రాంతాలు ముస్లింల దారుణ హింసా కాండను ఎదుర్కొనవలసి వచ్చింది. కాంగ్రెసు చెప్పిన మాటను నమ్మి నిశ్చింతగా కూర్చున్న హిందూ సమాజానికి ఘోరమైన స్థితి ఎదురయింది. ఈ భయానక పరిస్థితులలో హిందూ సమాజానికి అండదండలు అందించి వారికి ప్రేరణ యిచ్చిన వ్యక్తి గురూజీ ఒక్కరే.

## సంఘంమీద మొదటి దెబ్బ :

డాక్టర్‌జీ కలలుకన్న స్వతంత్ర భారతంలో హిందూ ధర్మం, హిందూ సంస్కృతి, హిందూ సమాజం పూర్తి రక్షణ పొందుతాయి. హిందువులను చెడు దృష్టితో చూచే ధైర్యం ప్రపంచంలో ఏ శక్తికీ ఉండదు. కానీ పదవులు అలంకరించిన నాయకులకు ఆ దృష్టి లేకపోయింది. అంతేకాదు 1947 ప్రాంతంలో సంఘ శాఖలు ప్రచండవేగంతో పెరగటం, సంఘ పలుకుబడి ఇబ్బుడిముబ్బుడి కావడం చూచి కన్ను కుట్టింది. ఈ సమయంలో జరిగిన గాంధీజీ హత్యతో ఏమాత్రం సంబంధం లేకపోయినప్పటికీ తప్పుడు కేసు బనాయించి ప్రభుత్వం సంఘాన్ని నిషేధించింది. గురూజీతో సహా వేలాది కార్యకర్తలను జైలులో నిర్బంధించింది.

అయితే, ఆ దమననీతికి లొంగలేదు సంఘం. గురూజీ నాయకత్వంలో ఆ అగ్నిపరీక్షలో వన్నె పెంచుకొని వెలికి వచ్చింది. డాక్టర్‌జీ నిర్మించిన కార్యపద్ధతి కారణంగా సంస్థ చెక్కు చెదరకుండా నిలబడింది. గురూజీ దేశమంతటా పర్యటించి సంఘం మీద కల్పించబడిన అపోహలను తొలగించారు. ఈ విషయాలను తెలుసు కోవటానికి బ్రహ్మాండమైన సంఖ్యలో సమావేశమయ్యే ప్రజలకు ఆయన హిందూ సంఘటన అవసరాన్ని బోధపరిచారు.

## మారిన పరిస్థితి, మారిన విధానం :

సంఘంవంటి సంస్థలలో లక్ష్యంనుంచి దృష్టిని మరల్చకుండానే మారిన పరిస్థితులకు అనువుగా క్రొత్త విధానాలను, పద్ధతులను వికసింపచేయటం అవసరం అవుతుంది. సంస్థను ప్రారంభించినప్పుడే అన్ని విషయాలు ముందుగానే

నిర్ణయించి ఒక చట్రంలో బిగించలేము. సంస్థలో ఏ దశలో, ఎవరెవరు ఏ పని చేయాలి మొదలైన వివరాలను (బ్లూప్రింట్) ప్రారంభంలోనే తయారుచేయలేము. అప్పుడు నిర్ణయించేవి ఆశయమూ, ఆ ఆశయాన్ని చేరుకొనే మార్గం మాత్రమే. కాలాను గుణంగా పనియొక్క రూపురేఖలు స్పష్టమౌతూ ఉంటాయి. వివరాలు నిర్ణయ మౌతూ ఉంటాయి. అంతవరకు చెప్పిన విషయాలను, అంతవరకు చెప్పవలసిన అవసరం రాని విషయాలను అనుకూల పరిస్థితులు ఏర్పడినప్పుడు మరింత స్పష్టముగా ప్రజలముందు ఉంచవలసి వస్తుంది. ఇలా చేయడంలో - అంటే డాక్టర్‌జీ భావనలకు రూపమివ్వడంలో - గురూజీ సాటిలేని ప్రజ్ఞను, ప్రతిభను చూపారు.

డాక్టర్‌జీ కాలంలో దేశాన్ని ఆంగ్లేయులు పాలించేవారు. వారిని తొలగించి జాతిని స్వతంత్రం చేయడం ఆ రోజులలో అందరికిగల ఏకైక లక్ష్యం. ఆ విషయంలో అభిప్రాయభేదం లేదు. కనుక స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపేటప్పుడు, ఆంగ్ల పాలననూ, ముస్లిం మతత్వాన్ని రెంటినీ ఒకే సమయంలో ఎదిరించకూడదని కాంగ్రెసు అనుకుంటే అర్థం చేసుకోవచ్చు. అయితే ఆ తర్వాత ఆ విధానం శరణాగతి ధోరణిగా, సంతుష్టీకరణ ధోరణిగా మారింది. ఆ ధోరణి డాక్టర్‌జీకి ఎంతమాత్రమూ నచ్చలేదు. హిందూ సమాజంపై జరుగుతున్న దాడులు, హిందువుల న్యాయమైన హక్కులు కాలరాచి వేయబడటం, కొట్లాటలు రెచ్చగొట్టే ముస్లింల స్వభావం ఆయనకు ఆవేశం కలిగించేవి. ఆ మాట ఆయన సూటిగా చెప్పేవారు. ఆయన తన వైఖరిని గాంధీజీ ఎదుట, గాంధీజీ సన్నిహితుడైన జమనాలాల్‌బజాజ్ ఎదుట స్పష్టంగా వివరించారు. హిందూ సమాజంపై జరిగే అత్యాచారాలపట్ల తన గుండెల్లో రగులుతున్న వేదనను ఆయన ఒక ప్రసంగంలో ఇలా వ్యక్తం చేశారు.

"వేయి సంవత్సరాల క్రితం హిందూ దేశంతో పాటు పరిసర దేశాలు కూడా హిందువుల ఆధీనంలో ఉండేవి. నేడు హిందూ దేశంలోనే హిందువులు ఈ దేశాన్ని హిందూదేశమని చెప్పటానికి వీలులేని దుస్థితి దాపురించింది".

"నేడు హిందూ సమాజాన్ని నలువైపులనుంచీ ప్రమాదాలు చుట్టుముట్టి ఉన్నాయి. ఇందుకు తప్పు మనదే. మనం బలహీనులం, నిద్రపోతున్నాం. ఒకవైపున విదేశీయుల, విధర్మీయుల పాలన, మరొకవైపున ముస్లింల అత్యాచారాలు - అడకత్తెరలో పోక చెక్కలం అయినాం మనం. ముస్లింలుగా మార్చటానికి హిందువులపై అత్యాచారాలు జరుగుతున్నాయి. మన స్త్రీలపై బలాత్కారాలు జరుగుతున్నాయి. ఇలాగే క్రైస్తవులుకూడా మనమీద దెబ్బ తీస్తున్నారు".

"ఈ దెబ్బలనుండి రక్షణపొందాలంటే మనం సంఘటితమై తీరాలి. పరమేశ్వరుని దయ మనమీద ఉన్నదని మన నమ్మకం. మనం మరొకరిమీద దాడి జరపం. అయితే హిందువులది అయిన హిందూదేశంలో తాము బ్రతుకుతున్నామనీ, హిందువుల హక్కులను అణిచివేసే హక్కు తమకు లేదనీ విధర్మీయులు కూడా గుర్తుంచు కోవాలి. హిందూ ధర్మసంస్కృతుల మేలుకోసం మనం సంఘం పనిని చేపట్టాలి. మహోజ్జ్వలమైన మన సంస్కృతిని రక్షించుకోవాలి. దానిని పెంపొందించాలి. అప్పుడు మాత్రమే ఈనాటి ప్రపంచంలో మనం, మన సమాజమూ నిలవడం సాధ్యం"

ఈ మూలసూత్రం ఆధారంగా గురూజీ సంఘకార్యాన్ని తీర్చిదిద్దారు. దేశంలో ఏర్పడ్డ క్రొత్త రాజకీయ వ్యవస్థ, ప్రజాస్వామ్యంలో ప్రజాభిప్రాయానికి లభించిన క్రొత్త బలం, వివిధ జీవన రంగాలలో పరాయి పద్ధతుల, సిద్ధాంతాల ప్రభావం పెరుగుతూ ఉండటం, దేశీయమైన పద్ధతులపట్ల, సిద్ధాంతాలపట్ల అజ్ఞానం, అశ్రద్ధ - ఇవన్నీ గమనించి ఆయన సంఘ సంస్కారాలు ఒంటబట్టిన కార్యకర్తలను వివిధ రంగాలలోకి పంపారు. ఆయా రంగాలలో జాతీయ భావాల ప్రభావాన్ని నిర్మించడం వారి పని.

# 5

మొదటి నుంచీ సేవా కార్యక్రమాలలో పాల్గొని పనిచేయడం డాక్టర్‌జీకి అలవాటు. సంఘ కార్యకర్తలకు సహజంగానే ఆ ఒరవడి అలవడింది.

## సేవాకార్యంలో డాక్టర్‌జీ ముందడుగు :

నాగపూర్‌కు కొద్దిదూరంలో రాంటేక్‌వద్ద ప్రాచీనమైన ఒక రామమందిరం ఉంది. రామనవమి రోజున అక్కడ తిరునాళ్ళు జరుగుతాయి. ఆ తిరునాళ్ళలో తుంటరులు యాత్రీకులను వేధించేవారు. అక్కడ ఏర్పాట్లు సరిగా ఉండేవికావు. డాక్టర్‌జీ అనేక సంవత్సరాలపాటు స్వయంసేవకులను పంపి అక్కడ తగు కట్టుదిట్టాలు చేయించారు. దుండగుల ఆటలు కట్టించారు. స్వయంసేవకులు ఈ సేవా కార్యాన్ని దీక్షతో నిర్వహించారు. అందరి మన్ననలూ అందుకున్నారు.

ఇలా శ్రమించి సమాజ సేవ చేయాలనే భావన డాక్టర్‌జీ నరనరాల్లో జీర్ణించి ఉంది. ఆయన కలకత్తాలో డాక్టర్ కోర్సు చదువుతున్నప్పుడు దామోదరనదికి వరదలు వచ్చాయి. మసూచి వ్యాధి వ్యాపించింది. ఆయన రాత్రింబవళ్ళు శ్రమించి బాధితులకు సేవచేశారు. వర్ధా సమీపంలోని ఆర్వీ గ్రామంలో ఒక బాలికను ముసలి వానికి ఇచ్చి పెండ్లి చేయాలని ఆమె తల్లిదండ్రులు మూర్ఖంగా నిర్ణయించారు. డాక్టర్‌జీ ఆమెను ఆ ఆపదనుంచి తప్పించారు. తగిన వరునితో ఆమెకు పెండ్లి జరిపించారు.

మసీదులముందు మేళం వాయించే హక్కు పౌరులకు ఉంది. కాని ముస్లింలకు జడిసి పెండ్లి ఊరేగింపు మేళాలు మసీదుముందు ఆగిపోయేవి. ఈ

పిరికితనం, గూండా చర్యలకు లొంగిపోయే ఈ మనస్తత్వం డాక్టర్‌జీని ఎంతగానో కలిచి వేసేవి. బాజాలు వాయించేవారు భయపడిన కారణంగా ఆయన స్వయంగా బాజా వాయించిన సందర్భాలు ఉన్నాయి. కాశీవిశ్వేశ్వర మందిరానికీ, ఇతర దేవాలయాలకూ పట్టిన దుర్గతిని గురించి మాట్లాడేటప్పుడు ఆయన ఆవేశం కట్టలు త్రెంచుకొనేది.

అనేక గ్రామాలకు తురకపేర్లు మార్పించి వాటి పూర్వపు పేర్లు పెట్టించారు. దావల్‌భక్త్ అనే పేరు మార్పించి ఒక స్వయంసేవకునికి గౌతమ్ అని పేరు పెట్టారు.

అనాథ హిందూ పిల్లలకోసం నాగపూర్‌లో అనాథవిద్యార్థి గృహాన్ని స్థాపించ టానికై డాక్టర్‌జీ తన సహచరుడు కాకాసాహెబ్ చోల్కర్‌కు ప్రేరణ నిచ్చారు. దీని వెనుక ఉన్న ఉద్దేశ్యాలు రెండు. వారిని సంస్కారాలు నిండిన వాతావరణంలో పెంచడం, ఇతర మతాల బారినుండి వారిని కాపాడటం.

సంఘం పెరగటం, హిందూ విద్యార్థులకు మంచి సంస్కారాలు ఇవ్వటం అనే రెండు ఉద్దేశ్యాలతో డాక్టర్‌జీ విద్యాసంస్థలకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చేవారు. అనాథ విద్యార్థిగృహం ఆధ్వర్యంలోనే ఒక హైస్కూలు ప్రారంభించబడింది. సంఘ కార్యకర్తలు పలువురు అక్కడ పని చేసేవారు. ప్రస్తుత సర్‌సంఘచాలక్ శ్రీ బాలా సాహెబ్ దేవరస్ కొద్దికాలం ఆ సంస్థలో ఉపాధ్యాయునిగా పనిచేశారు.

### *వారూ ఒకనాడు హిందువులే!*

హిందూ సమాజం ఇతరులకు తినుబండారం కాకూడదనీ, సమాజం తన ప్రజలను గురించి పట్టించుకోవాలనీ డాక్టర్‌జీ కోరారు. ఆనాడు దేశంలో ఉన్న పదికోట్ల మంది ముస్లింల గురించి ఆయన ఇలా చెప్పారు. "ఈ పదికోట్లమందీ మొదట్లో హిందువులే. చూస్తూ ఊరుకోవటంవల్ల వారిని మనం కోల్పోయాం". ఆ రోజుల్లో ఆర్య సమాజం ఇతర మతాలలోకి మారినవారిని తిరిగి హిందువులుగా మార్చేది. స్వామి శ్రద్ధానంద చేసిన ఈ పనికి రోషంవచ్చి మతోన్మాది అయిన ఒక ముస్లిం ఆయనను హత్య చేశాడు. 1921లో కేరళలోని మలబారులో హిందువులపై జరిగిన దారుణ మారణకాండ కూడ గుండెమండేలా చేసేదే. మతోన్మాద ముస్లింలు, క్రైస్తవ మిషనరీలు జరుపుతున్న కుట్రలకూ కుతంత్రాలకు హిందువులు బలికాకుండా ఉంచేందుకు జరిగిన చర్యలన్నింటికీ డాక్టర్‌జీ అండ ఉండేది. ఇలాంటి పనులు మొదలు పెట్టవలసినదిగా డాక్టర్‌జీ తన మిత్రులను ప్రోత్సహించేవారుకూడా.

## విశ్వరూపాన్ని ధరించిన సేవాభావం:

డాక్టర్‌జీ నాటిన ఈ విత్తనం గురూజీ కాలంలో మహావృక్షం అయింది. పుష్పించి ఫలించింది. దేవాలయ వ్యవస్థ మెరుగు కావడానికీ, పరాయివాళ్ళ దాడుల నుంచి వాటిని రక్షించడానికి స్వయంసేవకులు సమాజ సహకారంతో దేవాలయ సమితులు ఏర్పాటు చేశారు. కేరళలోని శబరిమలై క్షేత్రం వెళ్ళేదారిలో నీలక్కల్‌వద్ద క్రైస్తవులు ఓట్లవేట రాజకీయ నాయకుల మద్దతుతో చర్చిని నిర్మించటానికి చేసిన ప్రయత్నాలను వమ్ము చేశారు. కన్యాకుమారివద్ద వివేకానందశిలను ఆక్రమించు కోవటానికై క్రైస్తవులు చేసిన ప్రయత్నాలను త్రిప్పికొట్టి దేశమంతటినుండీ సహాయాన్ని సమీకరించి భవ్యమైన వివేకానంద శిలాస్మారకాన్ని అక్కడ నిర్మింప చేశారు. రామజన్మభూమి విముక్తికీ, యితర దేవాలయాల విముక్తికీ ప్రయత్నాలు జరుగుతున్నాయి. కొన్ని స్థలాలలో ఆలయాల ఆస్తులను హరించటానికి పాలకులు చేసే ప్రయత్నాలను ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. మేలుకొన్న హిందువులు తమ ఆలయాలకూ, శ్రద్ధాకేంద్రాలకూ జరిగే అవమానాలను సహించటానికి సిద్ధంగా లేరనేందుకు ఇవన్నీ తిరుగులేని రుజువులు.

బీహారు, రాజస్థాన్, మహారాష్ట్ర, గుజరాత్, రాయలసీమ మొదలగుచోట్ల కరువులు వచ్చినప్పుడు - మోర్వీ, దివిసీమ మొదలైన ప్రదేశాలలో వరదలు, తుఫానులు సంభవించినపుడు - భూకంపంవంటి ప్రకృతి బీభత్సాలు ఏర్పడినప్పుడు - కల్లోలాలు, భోపాల్ గ్యాస్ దుర్ఘటనలవంటి మనిషి కొని తెచ్చుకొన్న ప్రమాదాల సమయంలో - చైనా, పాకిస్తాన్‌లతో జరిగిన యుద్ధాల సమయంలో స్వయంసేవకులు భారీ ఎత్తున ప్రజలను ఆదుకొని నిస్వార్థ సేవకు ఆదర్శంగా నిలిచారు. ఆ విధంగా డాక్టర్‌జీలోని సేవా భావం నేడు స్వయంసేవకుల కృషిలో తన విశ్వరూపాన్ని చూపుతున్నది. స్వయంసేవకుల కార్యశూరత కారణంగా, నిస్వార్థ భావన కారణంగా సమాజానికి వారిపై ఎంతటి విశ్వాసం ఏర్పడిందంటే - సంఘం ఆయా సందర్భాలలో ఏర్పాటు చేసే సహాయ సమితులకు, సేవా పథకాలకోసం పెద్ద ఎత్తున ధన్నాన్ని సేకరించడం కష్టం కావడంలేదు.

సాంఘిక దురాచారాలను తొలగించే సంసిద్ధత, దురాక్రమణలను త్రిప్పికొట్టే సాహసం, సామర్థ్యం హిందూ సమాజంలో నిర్మాణం కావాలనే డాక్టర్‌జీ ఆశయాన్ని పూర్తి చేయడంకోసం గురూజీ విశ్వహిందూ పరిషత్‌నూ, వనవాసీ కల్యాణ ఆశ్రమాన్ని ప్రారంభింప చేశారు. వివిధ సంప్రదాయాలకు చెందిన ధర్మాచార్యులు, మఠాధిపతులందరూ ప్రజలను గురించి పట్టించుకొని సమాజంలో

ఐక్యతను, పవిత్రతనూ సాధించటానికి విశ్వహిందూ పరిషత్ కృషి చేస్తున్నది. అంటరానితనం శాస్త్ర సమ్మతం కాదని ధర్మాచార్యులు స్పష్టంగా ప్రకటించారు. "న హిందూ పతితో భవేత్" - హిందువు ఎవరూ పతితుడు కాజాలడు, "హిందవః సోదరః సర్వే" - హిందువులంతా సోదరులే - అనేవి హిందూ సంఘటనకు మంత్రములైనాయి. వీటన్నిటిలో గురూజీ పాత్ర చాల ప్రముఖమైనది.

వనవాసీ కల్యాణ ఆశ్రమ్ కొండకోనల్లోని వనవాసులలో ఆత్మగౌరవాన్ని తమ కాళ్లమీద తాము నిలబడాలన్న భావాన్ని తమ తాత ముత్తాతల నుండి వచ్చిన పూజా పద్ధతుల పట్ల నమ్మకాన్ని కలిగించింది. క్రైస్తవ ఫాదరీల కుట్రలను ఎదిరించే సాహసాన్ని నిర్మించింది. విశ్వహిందూ పరిషత్తు, వనవాసీ కల్యాణ ఆశ్రమం - రెండూ అనేక వసతి గృహాలు, వైద్యశాలలు, భజన మండలులూ, వృత్తి శిక్షణ సంస్థలు వంటి వాటి ద్వారా ఈ వనవాసీ బంధువులను మిగతా సమాజంతో సమాన స్థాయికి తెచ్చే పనిలో నిమగ్నమైయున్నాయి. మతం మార్పిడికి గురైన బంధువులను తమ పూర్వీకుల మతంలోకి తిరిగి తేవడంలో కూడా ఈ సంస్థలు సఫల మవుచున్నాయి. ఈ సంస్థలు నిర్వహించేవి కాక స్థానిక ప్రజల సహకారంతో వసతి గృహాలు, అనాథ శరణాలయాలు, బాలసంస్కార కేంద్రాలు, శిశు సంరక్షణ కేంద్రాలు, శిక్షణ తరగతులు, అన్ని హంగులూ కలిగిన ఆస్పత్రులు, బ్లడ్ బ్యాంకులూ, యోగాసన తరగతులు, పయోజన పాఠశాలలు, పఠనాలయాలు, గ్రంథాలయాల వంటివి అనేకం నిర్వహించబడుతున్నాయి. నేడు దేశమంతటిలో ఇతరులందరికన్న మిన్నగా స్వయంసేవకులు సేవా పథకాలు నిర్వహిస్తునానరనటం అతిశయోక్తి కాదు. హిందువులపై జరిగే అన్యాయాలను ఆపడానికి, అవసరమైనప్పుడు సంఘర్షణ జరపడానికి హిందూ మున్నని, హిందూమంచ్, హిందూవాహిని వంటి పేర్లతో వివిధ ప్రాంతాలలో సంస్థలు పనిచేస్తున్నాయి.

## *విద్యారంగంలో అద్భుత విస్తరణ :*

డాక్టర్‌జీవలె గురూజీకి కూడా విద్యపైన, విద్యార్థులపైన ఆసక్తి మెండు. స్వరాజ్యం వచ్చిన తర్వాత నకిలీ సెక్యులరిజం చేతుల్లో నలిగిపోయి దురదృష్టవశాత్తు మన విద్యావిధానం లక్ష్య విహీనమైంది. హీనతా భావాన్ని పెంచే చరిత్రను బోధిస్తోంది. శీలనిర్మాణం దానికి చేతకాని పని. తల్లిదండ్రులూ, విద్యార్థులు, విద్యా సంస్థలు, ఉపాధ్యాయులూ - అందరి మనసులలో విద్య రూపాయలతో ముడిపడి వుంది. ఈ విషవలయాన్ని ఛేదించి, నిరంతరంగా మన సంస్కారాలను నిలిపి

ఉంచడం కోసం శిశుమందిరం నుండి కళాశాల వరకూ వేలాది విద్యాసంస్థలు నేడు సంఘప్రేరణతో నడపబడుతున్నాయి. శిశుమందిరాలే 3500 వరకూ ఉన్నాయి. అవి తల్లిదండ్రుల ఆదరాభిమానాలను చూరగొన్నాయి. ఎందుకంటే - అక్కడ పిల్లలకు మంచి చదువుతో బాటు సంస్కారాలు అందుతాయని వారి నమ్మకం. ప్రభుత్వం విద్యాలయాలలో సంస్కృత బోధనను దాదాపు నిలిపివేసినట్లే. కాని ఈ శిశుమందిరాలలో సంస్కృతం బోధిస్తున్నారు. తొలి సంఘప్రచారక్ బాబా సాహెబ్ ఆప్టే ఆ రోజుల్లో సంస్కృతం నేర్చుకోవలసినదని స్వయంసేవకులకు నొక్కి చెపుతుండేవారు. నేడు అనేక పద్ధతులద్వారా సంస్కృతాన్ని ప్రసారం చేస్తున్నారు స్వయంసేవకులు. సాధారణ వ్యక్తిసైతం పదిరోజులలో సంస్కృతంలో మామూలు సంభాషణ జరుపగలడని సంస్కృత సంభాషణ తరగతులు నమ్మకం కలిగించాయి.

ఈ పనులన్నింటిలో, వీటిని నడిపే కార్యకర్తలలో ఒక విశేషం ఉంది. ప్రభుత్వాన్ని యాచించకుండా సమాజంనుండి వనరులను సమీకరించి ఈ సంస్థలన్నీ స్వశక్తిమీద పనిచేస్తున్నాయి. నకిలీ సెక్యూలరిజానికి బందీ అయిపోయి, ఎప్పుడూ హిందూ వ్యతిరేఖ వైఖరి అవలంబిస్తూ ఉన్న ప్రభుత్వంయొక్క దయా దాక్షిణ్యాల మీద ఈ సంస్థలూ, సేవా కార్యక్రమాలూ ఆధారపడిలేవు. కనుకనే - పదవీ రాజకీయాల నీలినీడలు వీటిపై పడే అవకాశం లేదు. వీటిని నిర్వహించే వారంతా ఈ సేవా కార్యక్రమాల ద్వారా సమాజ పరమేశ్వరుని పాదాల చెంత తమను తాము సమర్పించు కోవాలనే స్థిరసంకల్పంతో కృషి చేస్తున్నారు. ఈ దేశంనాది, నా చుట్టూఉన్న అవినీతిని నిర్మూలించి, లోపించిన ఆత్మగౌరవాన్ని పునరు ద్ధరిస్తాను అనే భావన నిజమైన దేశభక్తులకు శోభనిస్తుంది. సంఘప్రేరణతో నడుస్తున్న ప్రతిపనిలోనూ ఈ భావనే కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

అంటరానితనాన్ని రూపుమాపడానికి డాక్టర్‌జీకాని, సంఘం కాని ఉద్యమమేదీ నడపలేదు. ఘాటైన ఉపన్యాసాలివ్వలేదు. 'హిందువులంతా ఒక్కటే. అందరూ సమానులే. అంతా అన్నదమ్ములే. సంఘంలో కులాల ప్రసక్తి అసలు రాకూడదు.' - ఇదీ ఆయన చెప్పింది. ఇందులో ఏకాత్మత ఉంది. నిర్మాణాత్మక దృష్టి ఉంది. ప్రాంతం, భాష, మత సంప్రదాయం వంటివాటికి తక్కువ విలువ ఇచ్చి - అందరినీ కలుపుకొంటూ సాగిపోయే విశాల హిందూ సమాజాన్ని - సంఘటిత హిందూ సమాజాన్ని నిర్మించాలనే భావాన్ని ఆయన మేల్కొలిపారు. ఆ విధంగానే నడుచు కున్నారు. కనుకనే సంఘంలో అఖిలభారతీయ దృక్పథం వికసించింది. అన్ని ప్రాంతాలు, అన్ని భాషలు అన్ని - మత సంప్రదాయాలు మనవేనని భావించే

స్వభావం ఏర్పడింది. సమాజంలో స్నేహసామరస్యాలనూ, శక్తిని నింపడానికి సంఘం అనుసరించిన మార్గం సఫలమైనదని అనుభవం ఋజువుచేసింది.

డాక్టర్‌జీ అడుగుజాడలలో విద్యారంగంలో వలెనే కార్మికులు, రైతులు, సహకారం, కళాసాహిత్యాలు - మున్నగురంగాలలో కూడ సంఘ కార్యకర్తలు చేపట్టిన పనులు ముందడుగు వేస్తున్నాయి. అఖిల భారతీయ విద్యార్థి పరిషత్, భారతీయ మజ్దూర్ సంఘ్, భారతీయ కిసాన్ సంఘ్, సహకార భారతి, సంస్కారభారతి, సేవా భారతి, ప్రజ్ఞభారతి, గ్రాహక్ పంచాయత్‌వంటి పేర్లతో ఆ పని జరుగుతోంది. దీన్‌దయాళ్ పరిశోధనా సంస్థకు, వివేకానంద శిలాస్మారక సమితికి ప్రేరణ యిచ్చింది గురూజీయే.

ఈ పనులన్నీ చేస్తూకూడా శాఖపనికి విలువ తగ్గనివ్వలేదు గురూజీ. అంతే కాదు శాఖ అన్ని పనులకు ఆధారమని ఆయన పదే పదే స్పష్టం చేశారు. ఆధ్యాత్మికత పునాదిగా జాతిని పరమవైభవ స్థితికి చేర్చాలనే లక్ష్యాన్ని ధృవతారగా కళ్ళ ఎదుట నిలుపుకొంటూ డాక్టర్‌జీ, ఆయన తర్వాత వచ్చిన సంఘచాలకులు ప్రతి అడుగు ముందుకు వేశారు.

### *కబడ్డీనుండి కర్మవీరులు:*

సంస్థ పెరిగినకొలదీ క్రొత్త క్రొత్త బాధ్యతలు ఏర్పడుతూ వచ్చాయి. సంఘం బలం పుంజుకుంటూ పోయినపుడే హిందూ రాష్ట్రం ప్రగతిని సాధించి పరమవైభవ స్థితిని పొందగలుగుతుందని స్పష్టమౌతూ వచ్చింది. అయినా మౌలికమైన సిద్ధాంతం లోనూ, ఆచరణలోనూ ఏ విధమైన మార్పు రాలేదు. దీన్నిబట్టి వ్యక్తికి ప్రాముఖ్యం ఇవ్వకుండా దూరదృష్టితో డాక్టర్‌జీ సంఘాన్ని నిర్మాణం చేశారని స్పష్టమౌతోంది.

సంఘకార్యకర్తలు పలువురు యాభై సంవత్సరాలుగా అదే ఉత్సాహంతో పని చేస్తూ ఉండటం చూచినప్పుడు సంఘం బయట ఉన్న సామాజిక కార్యకర్తలు పలువురికి ఆశ్చర్యం కలుగుతోంది. డాక్టర్‌జీ తన జీవితాన్ని ధారపోసి కళ్ళ ముందుంచిన ఆదర్శం, ఎలాంటి పరిస్థితులలోనూ చెక్కుచెదరని లగువూ, బిగువూ ఉన్న కార్యపద్ధతి ఇచ్చిన వరం అది. ఎవరో ఒక నాయకుని అడుగుజాడలలో నడవాలని ఉపదేశం యివ్వటం పరిపాటి అయ్యిందని డాక్టర్‌జీ చెప్పేవారు. తమ నాయకుడు నడిచినంతవరకూ నడిచి, ఆ తర్వాత ఆ అడుగుజాడలు కనపడక ఆగిపోతే పురోగతి ఎలా వుంటుంది? లక్ష్యాన్ని చేరటం ఎలా ? లోకమాన్య తిలక్ పేరు

చెప్పుకొని ఆయన అడుగుజాడలలో నడుస్తున్నట్లు నటిస్తూ కాలక్షేపం చేసే వ్యక్తులు పలువురిని డాక్టర్‌జీ చూచి ఉన్నారు. డాక్టర్‌జీ అనుచరులు మాత్రం ఆ పొరబాటు చేయలేదు. క్రొత్త పరిస్థితుల సవాళ్ళను స్వీకరించి వారు సంఘ కార్యాన్ని ముందుకు నడిపించారు.

డాక్టర్‌జీ సంఘాన్ని ఏ ఉద్యమంలోనూ ప్రత్యక్షంగా పాల్గొననివ్వలేదు. 1930 నాటి కాంగ్రెసు ఉద్యమంలో ఆయన పాల్గొన్నారు. అయితే సర్‌సంఘచాలక్ బాధ్యత ఇంకొకరికి అప్పగించి పాల్గొన్నారు. పూనాలో సోన్యా-మారుతి సత్యాగ్రహం జరుగుతున్న సమయంలో అక్కడి సంఘశిక్షావర్గలో ఎందరో యువకులు శిక్షణ పొందుచున్నారు. అయినా వారి శిక్షణా కార్యక్రమానికి అడ్డు రానివ్వలేదు. తాను మాత్రమే ఆ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1938 లో జరిగిన భాగానగర్ (హైద్రాబాద్) సత్యాగ్రహంలో కూడా స్వయంసేవకులు వ్యక్తిగతంగానే పాల్గొన్నారు. ఉద్యమాలు వస్తుంటాయి పోతుంటాయి. అలాంటి ఉద్యమాల కారణంగా జాతి పునర్నిర్మాణానికై ప్రారంభమైన సంఘ కార్యాన్ని నిలిపివేయడం సంఘటన అనే కల్పవృక్షాన్ని పెకిలించి వేయటమే అవుతుంది - ఇదీ డాక్టర్‌జీ ఆలోచన. గురూజీ కాలంలో 1942లో క్విట్ ఇండియా ఉద్యమం జరిగింది. అనేక స్థలాలలో స్వయంసేవకులు వ్యక్తిగతంగా ఆ ఉద్యమంలో పాల్గొన్నారు. కానీ సంఘం పని మాత్రం ఆగలేదు.

అయితే 1948లో సంఘంపై నిషేధం విధించబడినప్పుడు సంఘ స్వయంసేవకులే న్యాయం పొందడంకోసం శాఖలు ప్రారంభిస్తూ దేశవ్యాప్తంగా ఉద్యమం నడిపారు. నిషేధాన్ని తొలగించడం ప్రభుత్వానికి తప్పనిసరి అయ్యేటట్లు చేశారు. 1953లో సంఘంయొక్క నాయకత్వంలో గోహత్య నిషేధం కోసమై మహోద్యమం నడిచింది. స్వయంసేవకులు గోహత్య నిషేధాన్ని కోరుతూ కోటి డెభై ఐదులక్షల సంతకాలను సేకరించి ప్రపంచ రికార్డు స్థాపించారు.

పాకిస్థాన్‌తో మూడుసార్లు జరిగిన యుద్ధాలలో స్వయంసేవకులు అమూల్యమైన సహాయం అందించారు. 1948లో పాకిస్తాన్ శ్రీనగర్‌పై దాడి చేసినప్పుడు స్వయంసేవకుల సాహసమే ఆ నగరానికి శ్రీరామరక్ష అయ్యింది. దేశవిభజన సమయంలో హిందూ బంధువులను రక్షించడంలో ఎందరెందరో స్వయంసేవకులు బలిదానం చేశారు. వారు తమ భద్రతను గురించి ఆలోచించలేదు. ఇతరులను ఆపదలో వదిలివేసి తమ కార్యక్షేత్రం నుండి పారిపోలేదు. ఇంతటి పరాక్రమం చూపడానికి స్వయంసేవకులకు మీరు ఎలాంటి శిక్షణ యిస్తారు? అని ఒక ఉన్నత స్థాయి సైనికాధికారి గురూజీని అడిగారు. 'కబడ్డీ నేర్పుతాం' - అని

నవ్వుతూ సమాధానం చెప్పారు గురూజీ. కబడ్డీ ఆటలోనే వారిలో అద్భుతమైన గుణగణాలు నిర్మాణ మైనాయి. ఎందుకంటే మనిషి గుండె ఎలాంటిది అన్న విషయంపైన అంతా ఆధారపడి ఉంటుంది. గుండె నీరసపడితే ఆయుధాలు ఉన్నా కండలు తిరిగిన శరీరము ఉన్నా ప్రయోజనము ఉండదు కదా !

ఆ తర్వాత 1975-77లో అత్యవసర పరిస్థితి వచ్చి పడింది. అంతటా నిరాశ రాజ్యమేలుతోంది. అయినా స్వయంసేవకులు ఆత్మ విశ్వాసంతో దృఢంగా నిలబడ్డారు. సమాజాన్ని తమవెంట నడిపించారు. ఆ ఆపదను జయించారు. ఇలా పరిస్థితులను బట్టి సిద్ధాంతపరంగానూ, ఉద్యమాలలోనూ, సంఘశాఖలలోనూ, బయటి సమాజంలోనూ పనిచేసే అనుభవాన్ని స్వయంసేవకులు గడించారు. సిద్ధాంతపరం గానూ, శారీరకంగానూ సంఘంమీద దాడులు మళ్ళీ మళ్ళీ జరుగుతూనే ఉన్నాయి. వాటిని ఎదిరించి నిలిచే సామర్థ్యాన్ని కార్యకర్తలు ప్రతిసారీ ప్రకటిస్తూనే ఉన్నారు. గత అయిదారు సంవత్సరాల చరిత్రనే చూస్తే - కేరళలోని మార్క్సిస్టులు జరిపిన దాడులను సంఘ కార్యకర్తలు త్రిప్పికొట్టగలిగారు. హిందూ సమాజంలో దృఢత్వాన్ని నిర్మించ గలిగారు.

## *సిద్ధాంతరంగంలో సాహసయాత్ర :*

హిందువుగా ఆలోచించడం, హిందుత్వాన్ని జాతీయతగా భావించడం అన్నది డాక్టర్‌జీ బోధ. ఈ సూత్రం సంఘం ప్రారంభించిన విశాల సిద్ధాంత ఉద్యమానికి ఊపిరి. ఈ సిద్ధాంతం ఆధారంగా సంఘ కార్యకర్తలు వివిధరంగాలలో సంస్థలు నిర్మించారు. హిందూ జీవనవిలువలలో, జీవన విధానంలో ఇమిడి ఉన్న మూల సూత్రాలపై ఆర్థిక, రాజకీయ, కార్మిక, వ్యవసాయిక, సామాజిక విధానాలను రూపొందించారు. వర్గపోరాటం, నువ్వా నేనా అనే పోటీ (Cut throat competetion), దానితో ముడిపడిన భోగవాదం, వెర్రితలలు వేసిన వ్యక్తి స్వేచ్ఛ, సర్వాధికారాలూ తన గుప్పెట్లో పెట్టుకున్న నిరంకుశ ప్రభుత్వం - ఆధునిక సిద్ధాంతాల పేరుతో చలామణిలో ఉన్న ఇటువంటి విషయాలను గురూజీ సిద్ధాంతపరంగా వ్యతిరేకించారు. హిందూజీవన ఆదర్శాలపట్ల సమాజంలో ఆయన నిర్మించిన విశ్వాసం అసామాన్యం, అద్భుతం. తదనుసారంగానే వివిధరంగాలలో సంఘ కార్యకర్తల ఆలోచనా సరళి సాగింది.

ఈ బ్రహ్మాండం అంతటిలో ఒకే పరతత్వం నిండివుంది. కనుక విశ్వంలో ఎక్కడా నిజంగా వైరుధ్యం లేదు. పరస్పర సామరస్యం, సహకారం ఆధారంగానే

లోక వ్యవహారాలన్నీ సాగుతూ ఉన్నాయి. ఇదీ హిందుత్వంయొక్క మూలసిద్ధాంతం. మనకు కనుపిస్తున్న సంఘర్షణ అంతా ఆ ఏకత్వం మనకు తెలియనందువల్ల ఏర్పడినదే. ఆ ఏకత్వం తనకు తెలిసే కొలదీ, అనుభవంలోకి వచ్చేకొలదీ వ్యక్తి క్రమక్రమంగా కుటుంబంతో, ఇరుగుపొరుగుతో, సమాజంతో, రాష్ట్రంతో, మానవాళితో, ప్రాణులన్నింటితో ఏకత్వాన్ని అనుభవిస్తాడు. ఆ విధంగా పరమాత్మవైపు, పరమసుఖంవైపు పయనిస్తాడు.

ఈ అనుభవం కుటుంబంతో మొదలౌతుంది. వ్యక్తి తన కష్టసుఖాల పరిధిని దాటి, కుటుంబం యొక్క కష్టసుఖాలే తనవిగా భావిస్తాడు. కుటుంబంకోసం ఎన్ని కష్టాలయినా పడతాడు. ఎంత ఖర్చయినా చేస్తాడు. ఈ కుటుంబ పరిధి పెంచుతూ పోయి చివరకు 'వసుధైవకుటుంబకమ్' - ఈ ప్రపంచమంతా ఒకే కుటుంబం - అనే భావన వరకు మనిషిని ఎదిగేటట్లు చేస్తుంది హిందూ సిద్ధాంతం. సంఘంవని కూడా ఈ కుటుంబ భావనయొక్క విశాల రూపమే. మనిషి తన కుటుంబ పరిధిని దాటి జాతినే కుటుంబంగా భావించడానికి సంఘం ఒక మెట్టుగా పనిచేస్తుంది. ఆ స్థితికి చేరినప్పుడు వ్యక్తి జాతి కష్టసుఖాలు తనవిగా భావిస్తాడు. జాతికోసం ఎలాంటి కష్టమైనా పడడానికి, ఎంతటి త్యాగమైనా చేయడానికి సిద్ధపడతాడు.

స్వయంసేవకులు ఈ కుటుంబ భావనను వివిధరంగాలలో నిర్మాణం చేశారు. పారిశ్రామికరంగంలో యాజమాన్యం - కార్మికులూ పరస్పరం విరోధులయిన రెండు వర్గాలని భావించరు. యజమానీ, కార్మికుడూ, నిర్వహణ సిబ్బందీ ముగ్గురూ ఒకే పారిశ్రామిక కుటుంబంయొక్క అవయవాలనీ, ఈ పారిశ్రామిక కుటుంబం జాతి కుటుంబం యొక్క అవయవమనీ భావిస్తారు. కనుకనే పరిశ్రమలను శ్రామికీకరణ చేయాలనీ - అంటే కార్మికుల పరం చేయాలనీ, కార్మికులను జాతీయకరణ చేయాలనీ - అంటే వారిలో జాతీయ భావనను నిర్మించాలనీ, జాతిని పారిశ్రామికీకరణ చేయాలనీ వారు కోరుతున్నారు. అలాగే - విద్యారంగంలో పనిచేస్తున్న విద్యాభారతి కూడా విద్యార్థులు, అధ్యాపకులు, యాజమాన్యాలు, తల్లిదండ్రులు - అంతా ఒకే విద్యా కుటుంబంయొక్క అవయవాలని భావిస్తోంది. అట్లే పాలకులూ, ఉద్యోగులూ, ప్రజలూ అంతా కలిసి ఒక కుటుంబం. తాత్విక చింతనలోకూడ సంఘ సిద్ధాంతం యొక్క ప్రభావాన్ని వ్యాపింప చేయటానికి మేధావులైన కార్యకర్తలు పలువురు అపురూపమైన కార్యశూరతను కనబరిచారు.

## పని ప్రధానం - ఆ తర్వాతనే ప్రచారం :

సంఘస్థాపన తర్వాత - తొలి సంవత్సరాలలో డాక్టర్‌జీ సంఘాన్ని ప్రచారానికి దూరంగా ఉంచారు. ప్రచారం విలువ తెలియక కాదు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో 1919లో 'సంకల్ప' అనే హిందీ వారపత్రికకు ఆయన సంపాదకులుగా ఉన్నారు. ఆ తర్వాత పూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాన్ని జాతీయ భావాలనూ ప్రచారం చేయటానికి డాక్టర్‌జీ మిత్రబృందం 'స్వాతంత్ర్య' అనే దినపత్రికను కొంతకాలం నడిపారు. ఆ దినపత్రికలో డాక్టర్‌జీ ధనసేకరణనుంచి సంపాదకత్వం వరకూ అన్ని పనులూ పైసా తీసుకోకుండా చేశారు.

ఈ ప్రచార సాధనాల గురించి ఆయన ఎప్పుడూ జాతీయ దృష్టితోనే ఆలోచించే వారు. జాతిప్రగతికి పనికి వచ్చినప్పుడే పేరు ప్రతిష్ఠల ప్రయోజనం. ఒక పనికయినా, వ్యక్తికయినా అవసరంకన్న ముందుగా పేరువస్తే అందువలన ఆ పనికీ, ఆ వ్యక్తికీ నష్టం జరిగే అవకాశం ఉంది. అయితే తగు మోతాదులో పరిమితంగా వచ్చే ప్రచారానికి డాక్టర్‌జీ అభ్యంతరం చెప్పలేదు. అలాంటి ప్రచారంవలన ఉత్సాహం పెరుగుతుంది. పనికి బలం చేకూరుతుంది. సంఘంలో ప్రముఖ కార్యక్రమం జరిగినప్పుడెల్ల ఆ వార్తను ఆయన పత్రికలకు పంపేవారు. నాగపూర్‌లోని 'మహారాష్ట్ర' వారపత్రిక సంపాదకుడు గోపాలరావు ఓగ్లే డాక్టర్‌జీకి ఆత్మీయులు. సంఘ ఉత్సవాల వార్తలను ఆయన పంపినవి పంపినట్లు ప్రచురించేవారు. ప్రభుత్వోద్యోగులూ, స్థానికసంస్థల ఉద్యోగులూ సంఘ కార్యక్రమాలలో పాల్గొనకూడదని మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేసినప్పుడు ఈ పత్రిక ఆ విషయమై డాక్టర్‌జీ వాదాన్ని ప్రముఖంగా ప్రచురించింది. తన ప్రసంగాల్లో హిట్లర్‌ను పొగడుతున్న వాక్యం ఒక్కటైనా చూప వలసిందని డాక్టర్‌జీ ప్రభుత్వానికి చేసిన సవాలునూ ఆ పత్రిక ప్రచురించింది.

## ప్రచారసాధనాల వికాసం :

సంఘం పెరుగుతోంది. గురూజీ కార్యక్రమాలలో ప్రజలు భారీ సంఖ్యలో పాల్గొంటున్నారు. సంఘానికి ప్రచారం దానికదే వచ్చింది. పత్రికా ప్రతినిధుల గోష్ఠులు జరుగసాగాయి. అనేక ప్రశ్నలకు గురూజీ ఇచ్చిన సమాధానాలకు జాతీయ ప్రాధాన్యం వచ్చింది కూడా. 1975-77 నాటి అత్యవసర పరిస్థితి తర్వాత సంఘం బాగా వెలుగులోకి వచ్చింది. పత్రికలలో సంఘాన్ని గురించిన చర్చ రావటం మామూలైంది.ఆ విధంగా ప్రచారానికి దూరంగా ఉంటూ సాగిన సంఘంపని 1948

నాటి నిషేధం, గురూజీ వ్యక్తిత్వం, అత్యవసర పరిస్థితి సమయంలో ప్రజాస్వామ్య పరిరక్షణలో చూపిన కార్యశూరత కారణంగా మరింత వెలుగులోకి వచ్చింది. సంఘం దేశమంతటా విస్తరించి ఉన్న సంస్థ. ఇపుడు దానిని ఉపేక్షించటం సాధ్యమయ్యే పని కాదు. నేడు పత్రికలు సంఘాన్ని గూర్చి వ్రాస్తూ ఉండడానికి కారణం ఇదే.

1948 తర్వాత ఏర్పడ్డ క్రొత్త పరిస్థితిలో సంఘ కార్యకర్తలు స్వయంగా పత్రికా రంగంలో ప్రవేశించారు. 1948లో సంఘంపై దుష్ప్రచార దుమారం ఎంత తీవ్రంగా సాగిందంటే - స్వతంత్ర భారత పార్లమెంటులో సంఘానికి న్యాయం జరగాలని వాదించటానికి ఎవరూ ముందుకు రాలేదు. సంఘం విడుదల చేసిన ప్రకటనలను ప్రచురించే దమ్ములు ఏ పత్రికకూ లేకపోయాయి. అప్పుడు సంఘం చెప్పే మాట ప్రజలకు అందడానికి, సంఘనాయకుల ప్రకటనలు ఇచ్చినవి ఇచ్చినట్లు ప్రజల వద్దకు చేరడానికీ వివిధ భాషలలో వార్తాపత్రికలు ప్రారంభించబడ్డాయి. ఢిల్లీలో ఇంగ్లీషులో 'ఆర్గనైజర్' పత్రిక 1947 లోనే ప్రారంభమైంది. లక్నోనించి హిందీలో 'రాష్ట్రధర్మ' మాసపత్రిక ప్రారంభించబడింది. నిషేధ సమయంలో లక్నోనుంచే 'స్వదేశ్' దినపత్రిక, 'పాంచజన్య' వారపత్రిక ప్రారంభమైనాయి. ఆ రోజుల్లో ఈ పత్రికలు ఎంతో విలువైన సహకారం అందించాయి. ఈ పత్రికల నోళ్ళు మూయించ డానికి జరిగిన ప్రయత్నాలు విఫలమైనాయి. అప్పుడు ప్రారంభమైన అనేక పత్రికలు ఇప్పటికీ నడుస్తున్నాయి.

ఇంచుమించు ఆ సమయంలోనే శ్రీ బాలాసాహెబ్ దేవరస్ ప్రేరణతో క్రొత్తగా ఏర్పడిన ఒక లిమిటెడ్ కంపెనీ నాగపూర్‌లోని ప్రముఖ దినపత్రిక 'తరుణ భారత్'ను కొనుగోలు చేసింది. ఆ తర్వాత పూనా, బొంబాయి, షోలాపూర్‌లనుంచి దాని ప్రచురణలు (ఎడిషన్లు) వెలువడుతున్నాయి. ఇందోర్‌లోని 'స్వదేశ్' దినపత్రికకు, నాగపూర్‌లోని 'యుగధర్మ' దినపత్రికకు కూడా గ్వాలియర్, భోపాల్, రాయపూర్, జబల్‌పూర్ లాంటి పట్టణాలనుండి ప్రచురణలు వెలువడుతున్నాయి. తెలుగులో 'జాగృతి' వారపత్రిక 1948 నుంచే వెలువడుతోంది. నేడు దాదాపు అన్ని ప్రాంతీయ భాషల లోనూ దినపత్రికగాని, వారపత్రికగాని, మాసపత్రికగాని నడుస్తోంది. ఈ పత్రికలకు మంచి పాఠకవర్గం కూడ లభించింది. సంఘంపై జరిగే దుష్ప్రచారానికి ఈ పత్రికలు సమాధానం చెపుతున్నాయి. వివిధ రంగాలలో సంఘ సిద్ధాంతాన్ని పోలిన సిద్ధాంతాలతో పనిచేస్తున్న సంస్థల కార్యక్రమాలకూ, ఉద్యమాలకూ, భావాలకూ కూడ సహజంగా ప్రచారం లభిస్తున్నది. నేడు సంఘాన్ని వ్యతిరేకించే వారు సైతం దాని అభిప్రాయాన్ని తెలుసుకోవడానికి ఆసక్తి కనబరుస్తున్నారు.

# 6

డాక్టర్‌జీ ఇప్పుడు మనమధ్య లేకపోయినా, వారు స్థాపించిన సంఘంవలన ప్రేరితులైన లక్షలాది స్వయంసేవకుల హృదయాలపైనున్న వారి ముద్ర నిత్య స్ఫూర్తి దాయిని.

## *గుండెగుండెలో డాక్టర్‌జీ :*

డాక్టర్‌జీ నాటిన సంఘం అనే వటవృక్షంయొక్క విత్తనమే ఈ విధంగా వికాసం పొందింది. విస్తరించింది. విత్తనంలో చెట్టు ఇమిడి ఉంటుంది. క్రమ క్రమంగా వెలికి వస్తుంది. అందుకోసం మొదట దానిని పోషించాలి. కాపాడాలి. దాని వ్రేళ్ళు నేలలో లోతుకు దిగేటట్లు, బోదె బలపడేటట్లు చూడాలి. ఆ తర్వాత ఆ వ్రేళ్ళు వాటికవే నేలనుంచి జీవరసాన్ని పీల్చుకుంటాయి. ఆ జీవరసమే చెట్టును పచ్చగా ఉంచుతుంది. విత్తనంలోని గుణాలే చెట్టులోని పూవులలో, పండ్లలో వెలికివస్తాయి. అలాగే సంఘ కార్యకర్త ఏ రంగంలో ఉన్నా స్వదేశంలో ఉన్నా విదేశంలో ఉన్నా - కొన్ని బలమైన, స్థిరమైన సంస్కారాలతో నడుచుకొంటాడు. అతడు చేసే పనిలో, అతని జీవితంలో ఆ సంస్కారాలు ప్రతిబింబిస్తాయి.

ఆ సంస్కారాలలో ముఖ్యమైనవి యివి - అతడు మాతృదేశాన్ని తన ప్రాణాల కన్న మిన్నగా ప్రేమిస్తాడు. ధర్మ సంస్కృతులను కాపాడాలనే కోరిక అతనిలో ప్రబలంగా ఉంటుంది. సమాజానికి వచ్చే ప్రమాదాన్ని అతడు తనకు వచ్చిన ప్రమాదంగా భావిస్తాడు. హిందూ సమాజంలో ఒకరు ఎక్కువనీ, ఒకరు తక్కువనీ

అతడు ఎన్నడూ భావించడు. అతనికి అందరూ సమానులే. అందరివట్ల అతని హృదయంలో ప్రేమ పొంగిపొరలుతూ ఉంటుంది. సమాజం పనిచేస్తున్నప్పుడు 'నాకేమి వస్తుంది' అన్న ఆలోచన అతని దరిదాపులకు రాదు. తను, మన, ధనములతో అతడా పనికి తనను తాను అర్పణ చేసుకొంటాడు. అనుశాసనాన్ని పాటిస్తాడు. అహంకారం అతనిని అంటదు. తన యిల్లూ వాకిలీ చక్కదిద్దుకొంటూనే అతడు సమాజ కార్యానికి తన జీవితంలో మొట్టమొదటి స్థానం యిస్తాడు.

డాక్టర్‌జీని స్వయంగా చూచిన కార్యకర్తలు బహుకొద్దిమంది మాత్రమే. అయితే కార్యకర్తలందరి మనసులలో డాక్టర్‌జీ రూపం వెలుగొందుతోంది. పెద్దలు ఆయన గుణాలను కీర్తించగా వారు వినియున్నారు. ఆయన జీవితచరిత్రను కూడా వారు చదివియున్నారు. సంఘమూ, డాక్టర్‌జీ ఏకరూపులనీ, విడదీసి చూడటం సాధ్యపడదనీ అనుభవం ద్వారా తెలుసుకొన్నారు. సంఘస్థాపనకు ముందు ప్రజాహిత రంగంలో డాక్టర్‌జీ గడించిన అనుభవంతో చేసిన ఆలోచనల సారమంతా స్వయంసేవకులకు ఆయన నేర్పిన అలవాట్లలో కనబడుతుంది. ఏటికొకరు, కోటికొకరుగా చీలిపోయి, ఓడిపోయి, అలిసిపోయి, తననుతాను మరచిపోయిన ఒక సమాజాన్ని; ప్రాచీనమూ, విశాలమూ అయిన ఒక జాతిని ఈ విధంగా సంఘటితం చేయడానికి చేసిన ప్రయోగం చరిత్రలో మరొకటి లేదు. తన సద్గుణాల బలంతో ఈ ప్రయత్నాన్ని సఫలం చేసి చూపిన ఆ మహాపురుషుణ్ణి కృతజ్ఞతతో స్మరించటం, ఈ పనిని ముందుకు తీసుకు వెళ్ళటం ప్రతి హిందువుకూ సహజం.

## సంఘమే నా ఊపిరి :

డాక్టర్‌జీ జీవనకార్యాన్ని విప్పిచెప్పటానికై గురూజీ ఎన్నెన్నో ప్రసంగాలు చేశారు. డాక్టర్‌జీతో కలిగిన అనుభవాలను వినిపించారు. గురూజీ మామూలు వ్యక్తి కారు. మరొకరికి దాసోహమనే స్వభావం కాదాయనిది. కానీ డాక్టర్‌జీ ఆయనను పూర్తిగా గెలుచుకొన్నారు. స్వామి అఖండానందజీ ద్వారా రామకృష్ణ — వివేకానంద సంప్రదాయం గురూజీ జీవితంలో ప్రవేశించింది. ఆధ్యాత్మిక సాధన ద్వారా ఆయన ఎంతో ఎదిగిపోయారు. ఆత్మానందాన్ని అనుభవిస్తూ ఆయన ఎక్కడయినా ఉండగలిగే వారు. డాక్టర్‌జీ తన ప్రభావం ద్వారా అలాంటి ఆధ్యాత్మిక వ్యక్తిత్వాన్ని పూర్తిగా సంఘమయం చేయగలిగారు.

ఈ అద్భుతం ఎలా జరిగింది? గురూజీయే స్వయంగా సమాధానం చెప్పారు. డాక్టర్‌జీ సమాజంతో పూర్తిగా ఏకమై పోయారనీ, ఆయనకు తన ప్రత్యేక

అస్తిత్వమంటూ ఏదీ మిగలలేదని ఆయన చెప్పారు. హిందూ సమాజమే ఆయనకు ఇలవేలుపు. ఆరాధ్యదైవం. సమాజరూపంలో ఉన్న ఆ పరమేశ్వరునికి ఆయన తనను తాను పూర్తిగా అర్పణ చేసుకొన్నారు. భక్తిభావన యొక్క ఆ శిఖరాగ్రాన్ని ఆయన చేరుకొన్నారు.

## *సమాజమే నా ఇలవేలుపు:*

సమాజ రూపంలో ఉన్న పరమేశ్వరుని నిత్యజీవితంలో ఉపాసించటం గురూజీకి డాక్టర్‌జీ నుంచి అలవడింది. రామకృష్ణ-వివేకానంద సంప్రదాయం ఆత్మ జ్ఞానాన్ని సాధననూ, భక్తినీ, సేవనూ అలవరించింది. ఈ రెండింటి సంగమం కారణంగానే సంఘటనా రంగంలో గురూజీ నాయకత్వం మహోజ్వలంగా ప్రకాశించింది. ఆధ్యాత్మిక బలం కలిగిన గురూజీ వంటి నాయకుడు సమాజం పనికి దొరకటం అన్నది ఎన్నెన్నో శుభపరిణామాలకు కారణమైంది. ధార్మిక ప్రముఖుల దృష్టి సమాజంవైపు మళ్ళింది. సమాజం యొక్క కష్టసుఖాలను గుర్తించటానికీ, సమాజ సంఘటనకై తాము ఏకం కావటానికీ వారికి ప్రేరణ లభించింది. అంటరాని తనం వంటి దురాచారాలు నిరాధారాలని వారు ప్రకటించారు. వాటి నిర్మూలనకు వారి సహకారం లభిస్తోంది. హిందువులను మేలుకొలిపే పని వేగం పుంజుకొంటున్నది. గురూజీ వ్రాసిన లక్షలాది ఉత్తరాలు, ఆయన జరిపిన ప్రజాసంపర్కం అద్భుతమైనవి. గురూజీద్వారా జరిగినపని డాక్టర్‌జీ ఆత్మకు పూర్తి సంతృప్తిని కలిగించి ఉంటుంది.

డాక్టర్‌జీ ఆలోచనలకు గురూజీ ఆచరణ రూపం యిచ్చారు. వాటి సిద్ధాంత బలాన్ని పెంపొందించారు. పూర్తి పరిజ్ఞానంతో, అర్థవంతంగా, మూలసూత్రాల ఆధారంగా ప్రతి అంశంపై అభిప్రాయాన్ని వ్యక్తం చేసే గురూజీవంటి నాయకులు అరుదుగా లభిస్తారు. డాక్టర్‌జీ ఈ విధంగా జాతికి ఇచ్చిన వరం చరిత్రపై చెరగని ముద్ర వేసింది.

## *దేశహితమే గీటురాయిగా :*

ఈ మహాపురుషులిద్దరూ 48 సంవత్సరాలపాటు తపస్సుచేసి గడించి యిచ్చిన బలంతో సంఘం ముందడుగు వేస్తోంది. హిందూ సమాజానికి ఈ దేశంలో న్యాయమైన స్థానం లభించడానికి ఏయే చర్యలు తీసుకోవాలి - అనే విషయంలో ఆలోచనలు మరింత స్పష్టమౌతున్నాయి. హిందూ సమాజపులోతులను తాకేటంతగా

వ్యాపిస్తున్నాయి. ఒక్కొక్క కార్యక్రమాన్ని చేపట్టటం - దానిని సఫలం చేయటం జరుగుతోంది. సమాజంలోని లోపాలను సరిదిద్దడానికీ, భౌతికంగా, మానసికంగా దానిలో ఏర్పడిన బలహీనతలు తొలగించటానికీ నిస్వార్థసేవ అనే మహాయజ్ఞం నిరంతరంగా సాగుతోంది. దేశంలోని రాజకీయ పరిణామాలనుకూడ సంఘం నిశితంగా పరిశీలిస్తోంది. జాతీయ ప్రయోజనాలకు హాని కలిగించే పరిణామాల గురించీ, ప్రభుత్వ విధానాల గురించీ, సంఘం ప్రజలకు ఎప్పటికప్పుడు హెచ్చరికలు చేస్తూనేవుంది.

మైనారిటీల వ్యవహారం కారణంగా, ఆ విషయంపై ప్రభుత్వ విధానం కారణంగా ఏర్పడుతున్న ప్రమాదాలను సంఘం స్పష్టంగా జాతికి వివరించింది. జాతీయ సమైక్యతను కాపాడటానికై సంఘం కొన్ని సూచనలు చేసింది. అవి - 'మైనారిటీ కమీషను రద్దుచేసి దాని స్థానంలో మానవహక్కుల కమీషన్‌ను నియమించాలి. కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించే రాజ్యాంగంలోని 370వ సూత్రాన్ని రద్దు చేయాలి. విదేశీక్రైస్తవ మిషనరీలను దేశంనుంచి బయటకు పంపించి వేయాలి. క్రైస్తవసంస్థలకూ, ముస్లింసంస్థలకూ మతంమార్పిడి కోసం విదేశాల నుండి అందుతున్న కోట్లాదిరూపాయల ధనంపై పూర్తి నిషేధం విధించాలి. హిందువులు అల్పసంఖ్యాకులుగా మారిన ప్రాంతాలు దేశంనుంచి వేరు చేయబడతాయి కనుక బలవంతపు మతం మార్పిడులను చట్టరీత్యా నిషేధించాలి'-

పంజాబు సమస్యపైకూడ సంఘం నూటికి నూరుపాళ్ళు జాతీయమైన వైఖరిని అవలంబించింది. సిక్కులు హిందూ సమాజంలో అంతర్భాగమేననీ పంజాబులో వ్యాపించి ఉన్న అశాంతి స్వార్థపరులైన నాయకుల పదవుల ప్రాకులాట ఫలితమేననీ సంఘం చెప్పింది. కేశధారీ సిక్కులతోసహా హిందువులందరిలో ఈ అవగాహన కలిగించటానికి సంఘం ప్రయత్నిస్తోంది. ఇందుకు తోడుగా - హిందూ సమాజంలోని దురాచారాలను, నీరసపరిచే దోషాలనూ తొలగించటానికై సంఘకార్యకర్తలు ఉద్యమిస్తున్నారు. హిందూ జాగరణకోసం నిరంతరంగా జరుగుతున్న ఈ ప్రయత్నాల ఫలితం గత కొద్ది సంవత్సరాలుగా స్పష్టంగా కనిపిస్తోంది.

## హిందూ ఓటుశక్తి నిర్మాణం కావాలి:

రాజకీయ రంగంలో పదవుల వేట కారణంగా దాపురించిన విష పరిణామాలు జాతికి తీరని హానిని కలిగిస్తున్నాయి. అవినీతి, భోగవిలాసాలు, ముఠాల కుమ్ములాటలు, సంకుచిత భావాలూ ఉండనే ఉన్నాయి. ఇవిచాలవన్నట్లు - ఓట్ల

కక్కుర్తితో మైనారిటీలను నెత్తికెక్కించుకొనే ధోరణి ఒక ఉపద్రవంగా పరిణమిస్తోంది. మూక ఉమ్మడిగా ఓటువేసే మైనారిటీల ఓట్లవేటలో మునిగిపోయిన నాయకులకు మరేదీ కనిపించటంలేదు. వారిని సంతుష్టీకరించే ప్రక్రియలో జాతి ప్రయోజనాలకు ఎంతటి దెబ్బ తగులుతుందో, దేశ భద్రతకూ, జాతి పటిష్టతకూ ఎన్ని ప్రమాదాలు ముంచుకు వస్తున్నాయో వారికి కానరావటంలేదు. హిందూఓటు అంటూ ఉన్నదని వారికి అనిపించకపోవటమే ఇందుకు కారణం. కనుక దేశ జనాభాలో 85 శాతం ఉన్న హిందువులు తమ ఓట్లకు ఉన్న బలమేమిటో ఈ నాయకులకు తెలియజెప్పాలి. ఇప్పుడు హిందువుల ప్రయోజనాలకు విరుద్ధంగా నడుస్తున్న రాజకీయ పార్టీలు ఇకముందు హిందూఓట్లను నిర్లక్ష్యం చేయకుండా చూడాలి. అప్పుడుమాత్రమే రాజకీయ రంగంలో సంస్కరణ ప్రారంభమౌతుంది. అందుకోసమై ప్రజాస్వామ్యంలో లభించే ప్రతి వేదికనూ హిందూ ఓటును సమీకరించటానికి వాడుకోవచ్చు.

భారతీయ జనతా పార్టీ ఒక్కటే సంఘం మతతత్వ సంస్థ అనే చౌకబారు ప్రచారాన్ని అంగీకరించకుండా జాతియొక్క సర్వాంగీణ వికాసాన్ని సాధించటానికి కంకణం కట్టుకొన్న జాతీయసంస్థగా భావించే పెద్దపార్టీగా కనబడుతోంది. ఆ పార్టీ సహకారంతో, అలాంటి ఆలోచనలు కలిగిన ఇతర సంస్థల సహకారంతో దేశంలో అన్ని స్థాయిలలోనూ జరిగే ఎన్నికలలో 'హిందూఓటుకు' నిర్ణాయకమైన ప్రభావం వచ్చేటట్లు చేయడం అవసరమని సంఘం భావిస్తోంది. అలాంటి ప్రయత్నం జరిగితే కమ్యూనిస్టులుకూడా తమ ధోరణిని మార్చుకోవలసి వస్తుందని కేరళలో ఇటీవల జరిగిన ఎన్నికలు స్పష్టం చేశాయి.

## మేలుకొన్న హిందువు :

సంఘ కార్యకర్తలూ, వివిధ రంగాలలో పనిచేస్తున్న స్వయంసేవకులూ దేశమంతటా పర్యటిస్తూ ఉంటారు. అందువల్ల ఎక్కడ ఏమి జరుగుతోందో సంఘానికి సూటిగా తెలుస్తూ ఉంటుంది. ఈ సమాచారం ఆధారంగా సంఘం జాతికి వ్యతిరేకంగా జరుగుతున్న కుతంత్రాలను బయటపెడుతూ ఉంటుంది. ఆ విధంగా హిందూ సమాజాన్నీ ప్రభుత్వాన్నీ హెచ్చరిస్తూ ఉంటుంది. దాని ఫలితంగా వివిధ స్థలాలలో క్రైస్తవులూ, మహమ్మదీయులూ ఎలాంటి దురాక్రమణ చర్యలు జరుపు తున్నదీ తెలుసుకొన్నందువల్ల హిందూ సమాజం మేలుకొంటున్నది. వాటిని ఎదిరించ టానికి తనకు తానుగా సిద్ధమౌతోంది. హిందువులంతా అందులో పాల్గొంటున్నారు. విశాల హిందుత్వ భావనముందు కులభేదాలు, భాషాభేదాలు, మతసంప్రదాయ భేదాలు పటాపంచలు అవుతున్నాయి. ఈ మనఃస్థితిని నిర్మించటానికై సంఘమూ,

వివిధ రంగాలలో పనిచేస్తున్న కార్యకర్తలూ కృషి చేస్తున్నారు. ఈ మేలుకొలుపునూ, ప్రతిస్పందననూ రోజురోజుకూ పెంచడానికి సంఘ కార్యకర్తలు ఉద్యమిస్తున్నారు. ఇందువల్ల తమ ప్రయోజనాలు దెబ్బతిన్నవారు మండిపడి సంఘాన్ని దెబ్బకొడతారు కూడా. ఆ దెబ్బకు తట్టుకొని కుక్కకాటుకు చెప్పుదెబ్బ అనే వైఖరి అవలంబిస్తూ సంఘం తన మార్గంలో ముందుకు దూసుకుపోతూ ఉంది. ఈ రంగంలో దక్షిణ భారతంలోని 'హిందూ మున్నని'కి ప్రజలనుంచి లభిస్తున్న మద్దతు ఎంతో ఆశాజనకంగా వుంది. హిందూ బంధువులకు పరిస్థితిని సక్రమంగా తెలియజెప్పితే వారు ఒక త్రాటిపై నిలబడి దురాక్రమణ చర్యలను త్రిప్పికొట్టగలరనే నమ్మకం కలుగుతోంది. 'నేను ఒంటరివాణ్ణి' అనే భావం హిందువులలో తగ్గిపోతోంది. దేశమంతటిలో ఏ ఒక్క హిందువు తాను నిస్సహాయుణ్ణి అని భావించకుండా ఉండే పరిస్థితినే సంఘం నిర్మించగోరుతున్నది. సమాన భావాలు కలిగిన సంస్థలూ, కార్యకర్తలూ అంతా హిందూ సమాజ జాగరణ ద్వారా ఈ పరిణామాన్ని దేశవ్యాప్తంగా సాధించేందుకై పరస్పర సహకారంతో పని చేస్తున్నారు.

## వెల్లువలా పెల్లుబుకుతున్న ఆత్మగౌరవ భావన :

పరాయి మతాలవారు జరుపుతున్న దురాక్రమణల వార్తలు పత్రికలలో వస్తూనే ఉన్నాయి. గణేశ ఉత్సవాలనూ, రథయాత్రలనూ, హిందూ దేవతల ఉత్సవాలనూ, ఊరేగింపులనూ, నిరంతరాయంగా జరిపించటం ప్రభుత్వానికి పెద్ద సమస్య అవుతున్నది. ఉద్రిక్తతలను తొలగించేందుకు ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతి కూడ విచిత్రంగా ఉంటోంది. ఊరేగింపులు జరుపకూడదు, ఫలానా రోడ్లగుండా వెళ్ళగూడదు, నినాదాలు యివ్వకూడదు - అనే ఆంక్షలు హిందువులపై మాత్రమే విధిస్తోంది. ఆయా స్థలాలలోని హిందువులు గట్టిగా నిలబడి ఎదిరించినప్పుడే, గూండా చర్యలకు లొంగకుండా ఉన్నప్పుడే వారికి న్యాయం, గౌరవం లభిస్తున్నాయి.

సంఘ నిర్మాతకు పిరికితనమంటే మహాచిరాకు. ఎలాంటి బెదిరింపులకూ ఆయన ఎన్నడూ లొంగలేదు. ఆవును చంపటానికి తీసుకువెళుతున్న కసాయి వాడయినా, బానిసత్వంలో ఉన్న ప్రజలు తనకు సలాముచేయాలని కోరిన బ్రిటిష్ అధికారి అయినా, సంకెళ్ళు బిగిస్తానని బెదిరించిన కావలా పోలీసు అయినా, ఇంటిమీద రాళ్ళు రువ్విన గూండా అయినా - ప్రతి ఒక్కరి విషయంలోనూ ఆయన పరాక్రమం చూపారు. ఉద్రిక్త వాతావరణంలో అన్యాయాన్ని ఎదిరించేందుకై అనేక సందర్భాలలో ఆయన స్వయంగా ముందుకు దూకారు. ఏ సమాజంలో

మాతృమూర్తులకు, సోదరీమణులకూ, శ్రద్ధాకేంద్రాలకూ సహజంగా రక్షణ లభిస్తుందో ఆ సమాజమే బ్రతికి ఉన్న సమాజమని ఆయన ఖండితంగా చెప్పారు. అలాంటి జీవశక్తిని సమాజంలో నింపటానికే సంఘ కార్యకర్తలు శ్రమిస్తున్నారు. హిందూ సమాజం మేలుకొని ఆత్మగౌరవంతో తలఎత్తి నిలబడుతున్న కొద్దీ మరిన్ని ఘర్షణలు జరుగుతాయి. ఎందుకంటే - హిందువుల పరాక్రమాన్ని పరాయి వారు యింతవరకు చవిచూడలేదు. భయపడి పారిపోయే నాయకులూ, ఏదైనా సంఘటన జరిగీ జరగగానే ఇంట్లోకిదూరి తలుపు గడియవేసుకొనే ప్రజలూ - ఇదే చూచారు పరాయివాళ్ళు ఇంతవరకూ. ఇలాంటి స్థితిలో - మేలుకొన్న మనిషిగా సంఘ కార్యకర్త సమాజంలో పౌరుషానికి ప్రేరణ నిస్తూ ఉండటం అతని 'వీరవ్రతానికి' అనుగుణమే.

ఈనాడు మన హిందూ సమాజాన్ని ముక్కలు చెక్కలు చేయటానికి ఎన్నెన్నో శక్తులు పనిచేస్తున్నాయి. మనలో మనకు తగాదాలు కల్పించటం వారి కుతంత్రాలలో ఒకటి. పనికట్టుకొని లేనిపోని దుష్ప్రచారం చేసి ఒక వర్గం ప్రజల భావాలను వారు రెచ్చగొడతారు. ఇందుకు వారికి విదేశీధనం కుప్పలు తెప్పలుగా వచ్చి పడుతోంది. దీని వెనుక రాజకీయ దురుద్దేశాలు ఉండనే ఉంటాయి. వనవాసులను గురించి పట్టించుకొనకపోవటం, మన సోదరులలో కొందరిని దూరంగా ఉంచి నీచంగా చూడటం, సమాజంలో తాండవిస్తున్న దుర్భర దారిద్ర్యం - ఇలాంటి వాటినన్నింటినీ ఈ శక్తులు వాడుకొంటున్నాయి. ఇలాంటివారికి ఎరలు చూపుతున్నాయి. వనవాసులనూ, దళితులనూ, ఆపదలో చిక్కుకున్నవారినీ కబళించేం దుకు వారి కుట్రలు అడ్డూ అదుపూ లేకుండా సాగుతున్నాయి. ముస్లింలనూ, దళితులనూ కలిపి ఒక రాజకీయ వేదిక ఏర్పాటు చేయబడుతోంది. ఈ ఎత్తుగడల కారణంగా వివిధ స్థలాలలో వేర్పాటు కోర్కెలు బుసలు కొడుతున్నాయి. ఈ స్థితిలో సంఘ శాఖల ద్వారానూ, ధార్మిక నాయకులు, విద్వాంసులూ, నిస్వార్థపరులైన సమాజ సేవకుల ద్వారానూ సమాజంలో సమరస భావాన్ని నిర్మించటానికై సంఘం దేశమంతటా కృషి చేస్తోంది. అందరిలో పరస్పర విశ్వాసం నిర్మాణం చేయడానికీ, అందరినీ జాతీయ జీవనప్రవాహంలో కలవడానికీ, వారిలో హిందుత్వ భావనను మేలుకొలప డానికీ సంఘం పథకం ప్రకారం పనిచేస్తోంది. ఇలా అందరినీ కలుపుకు వచ్చే పనిని దీక్షతో చేయటం అవసరమనే అనుభవాన్ని సంఘనాయకులు స్వయం సేవకులకు కలిగిస్తున్నారు. ఈ పనికి సమాజంనుండి భారీ ఎత్తున సహకారం అందుతోంది.

## ప్రతిహిందువునూ సంఘటనలో అంతర్భాగం చేద్దాం :

ఈ విషయంలో డాక్టర్‌జీ ఇలా బోధించారు: 'మనంపని చేస్తున్నది హిందూ సమాజం అంతటికోసం. కనుక ఏ ఒక్కరినీ విస్మరించకూడదు. హిందూ బంధువు లందరి పట్ల - వారు అగ్రవర్గాలకు చెందినవారుగా భావించబడినా, నిమ్న వర్గానికి చెందిన వారుగా భావించబడినా - మన ప్రవర్తన ఒకే విధంగా ఉండాలి. ప్రేమతో కూడి ఉండాలి. హిందూ బంధువులలో ఏ ఒక్కరినైనా నీచునిగా భావించి ఈసడించు కోవడం మహాపాపం. ముఖ్యంగా స్వయంసేవకుల మనస్సులలో ఇలాంటి సంకుచిత భావం ఉండకూడదు. దేశాన్ని ప్రేమించే ప్రతి హిందువునూ మన స్వంత అన్నదమ్మునిలా చూసుకోవాలి. మన ప్రవర్తన ఆదర్శవంతంగా ఉంటే మన హిందూ బంధువులందరూ మనవైపు ఆకర్షితులైతీరుతారు. ఈ ఒరవడిలో సంఘం సామాజిక సమరసత వైపు ముందడుగు వేస్తోంది.

సంఘం ఒక సజీవసంస్థ అని డాక్టర్‌జీ చెప్పేవారు. సజీవంగా ఉండటం అంటే జీవరసాన్ని గ్రహించి ఎదగటం. సహజంగా వికాసం పొందటం. సంఘ సిద్ధాంతం కమ్యూనిష్టు, ఇస్లాం, క్రైస్తవ మతాలవలె ఒక చట్రంలో బిగించబడిన 'వాదం' కాదు. డాక్టర్‌జీ గాని, గురూజీగాని, ఏదో ఒక ప్రత్యేక పరిస్థితిలో, ప్రత్యేక సందర్భంలో చెప్పిన మాటలను శిలాక్షరాలుగా భావించి మారిన పరిస్థితులలో, మారిన సందర్భాలలో క్రొత్త క్రొత్త ఆలోచనలు చేయకూడదన్నది సంఘం పద్ధతి కాదు. డాక్టర్‌జీ సంఘాన్ని ప్రారంభించిన సమయంలో ఇక్కడ విదేశీపాలన ఉండేది. అందువల్ల ఆయన ఎంతో జాగ్రత్తగా మాట్లాడవలసి వచ్చేది. నడుచుకోవలసివచ్చేది. ఆనాడు చెప్పటం సాధ్యపడని విషయాలు ఇప్పుడు చెప్పబడవచ్చు. సంఘాన్ని ప్రారంభించేటప్పుడు డాక్టర్‌జీ తన కళ్ళ ఎదుట నిలుపుకొన్న జీవన ఆదర్శాలనుంచి, ఆయన చెప్పిన మూల సూత్రాలనుంచీ సంఘం అవగింజంతైనా ప్రక్కకు తొలగజాలదు. ఎందుకంటే - అవి జాతికి మూలసూత్రాలు. సంస్థయొక్క ధ్యేయాన్నీ పటిష్ఠతనూ, ప్రగతిని అడుగడుగునా దృష్టిలో పెట్టుకోవాలి. అయితే ఆ ఉద్దేశ్యాలను సాధించటానికి రూపొందించే కార్యక్రమాలలో లగువూ బిగువూ, పట్టువిడుపులూ ఉండవచ్చు. ఈ విజ్ఞత లేకపోతే 'సజీవసంస్థ' అని అన్న డాక్టర్‌జీ వర్ణనకు అర్థం లేకుండా పోతుంది.

## రాజకీయ పార్టీలకు దూరంగా :

దాస్యంలో ఉన్న జాతికి స్వాతంత్ర్యం పొందటం మినహా మరో రాజకీయం ఉండదని డాక్టర్‌జీ చెప్పారు. అందువల్ల హిందూ సమాజానికి స్వాతంత్ర్యం సంపాదించడానికై బలమైన సంఘటన నిర్మించడం ఆయన కళ్ళముందున్న సమీపలక్ష్యం. 1947 ఆగష్టు 15న రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. ప్రజాస్వామ్యంలో పార్టీ ఆధారంగా ఎన్నికల రాజకీయాలు ఆరంభమైనాయి. విధానాల సమస్య వచ్చింది. సర్వతోముఖ ప్రగతి సమస్య వచ్చింది. సంఘం ఎన్నికల రాజకీయాలలో పాల్గొనదనీ, జాతి సంఘటన, హిందూ జీవన ఆదర్శాల స్థాపన, బలమైన హిందూ జాతిని రూపొందించటం అనే డాక్టర్‌జీ ఆశయాలను సాధించటానికి కృషి చేస్తుందని గురూజీ అప్పుడు స్పష్టం చేశారు. ఏ జాతీయ ప్రయోజనం కోసం రాజకీయాలు అవసరమో ఆ జాతీయ ప్రయోజనం పట్ల పూర్తి శ్రద్ధ చూపుతుందనీ, అందుకు సంబంధించి తన అనుకూల అభిప్రాయాన్ని గానీ ప్రతికూల అభిప్రాయాన్ని గానీ తెలుపుతూ ఉంటుందనీ కూడ వివరించారు.

జాతికి ఆత్మ సంస్కృతి. కనుకనే — స్వతంత్ర భారత దేశంలో హిందూ సంస్కృతి పెంపొందించ బడాలని డాక్టర్‌జీ వక్కాణించేవారు. కాని రాజకీయ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత హిందూత్వానికి మత తత్వమనే ముద్ర వేయబడింది. మూర్ఖంగా హిందూ వ్యతిరేక విధానాలు అనుసరించ బడ్డాయి. అపుడు గురూజీ ఆవిధానాల వల్ల కలిగే ఘోర పరిణామాలను గురించి జాతిని హెచ్చరిస్తూ వచ్చారు. దేశ సంస్కృతినీ, సమగ్రతనూ కాపాడడంలో ప్రభుత్వానికి ఆయన నిర్మలమైన మనస్సుతో చేతనైన సహకారం అందజేశారు. 1948లో ప్రభుత్వం సంఘాన్ని నిషేధించినప్పుడు తమపై జరిగిన అన్ని విధములైన అత్యాచారాలను సహించి జాతిలో అంతర్గత కలహాలు ఏర్పడకుండా ఉండేందుకు శాంతంగా ఉండవలసిందిగా స్వయంసేవకులను ఆదేశించారు. జాతియొక్క శత్రువులతో వ్యవహరించ వలసి వచ్చినప్పుడు మనమూ, ప్రభుత్వమూ కలసి 'వయం పంచాధికం శతం' - మనం నూట ఐదుగురం అనే మహాభారత సూక్తికి అనుగుణంగా వ్యవహరించాలని ప్రకటించారు. చైనా, పాకిస్తాన్ దురాక్రమణ సమయాలలో సంఘ ప్రవర్తన ఈ ప్రకటనకు అనువుగా ఉంది.

ఖండిత భారతంలో పనిచేస్తున్న సంఘం అఖండ భారత్ ఆదర్శాన్ని మరువలేదు. జాతి అంతకూ ఆ ఆదర్శం గుర్తుండేందుకు సంఘం ప్రయత్నిస్తూ

ఉంది. దేశాన్ని తిరిగి ఏకం చేయాలనే ఆశయాన్ని మాతృభక్తితో నిండిన గుండెలలో మేలుకొలుపుతూ ఉంది. డాక్టర్‌జీ సమయంలో కూడా పాకిస్తాన్ నినాదం వినిపించింది. ఆ విషయంలో మెలకువతో ఉండాలని ఆయన సూచించారు కూడా. ఖండిత భారతి యొక్క స్వాతంత్ర్యం ఆయన లక్ష్యం కానేకాదు. కనుక - ఆయన కలలు కన్న స్వాతంత్ర్యం నిజం కానంతవరకూ ఆయన ఆత్మకు శాంతి ఎలా లభిస్తుంది? డాక్టర్‌జీ నిర్మించిన సంఘం అఖండ భారత్‌ను సాధించే శక్తిని నిర్మించడం కోసం నడుం బిగించి నిలిచి ఉంది.

## *విశ్వకల్యాణానికే హిందూ సంఘటన:*

సంఘానికి ముస్లింలపట్ల ద్వేషం ఉన్నదని, ఆక్రమణతత్త్వం ఉన్నదని ఆరోపణలు డాక్టర్‌జీ కాలంనుంచి వస్తున్నవే. డాక్టర్‌జీ వాటికి పలుమార్లు సమాధానం చెప్పారు కూడా. ఆక్రమణతత్త్వం విషయంలో డాక్టర్‌జీ అనుసరించిన వైఖరి 1920 నాగపూర్‌లో జరిగిన కాంగ్రెసు సభలలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఆయన ప్రతిపాదించిన తీర్మానంలో కనిపిస్తుంది. హిందువు ఎన్నడూ ప్రపంచానికి అపకారం తలపెట్ట జాలడని, ఎప్పుడూ దాని శ్రేయస్సునే కోరతాడని ఆ తీర్మానంలో స్పష్టమౌతోంది.

హిందూ సమాజం బలీయంగా ఉన్నప్పుడు మాత్రమే, ఆధ్యాత్మిక ఆదర్శాలను తన జీవితంలో వ్యక్తం చేసినప్పుడు మాత్రమే, ప్రపంచం హిందూ దేశం చెప్పిన మాట వింటుంది. బలము, సంఘటన, ఆత్మగౌరవంలేని జాతి చెప్పే మాటకు ప్రపంచంలో ఎలాంటి విలువా ఉండదు. మనిషికి మేలుచేసి, అతడి సుఖ శాంతులకు నిజమైన దారి చూపించే ఆధ్యాత్మిక సిద్ధాంతం ప్రపంచానికి ఎప్పుడూ అవసరమే. అందుకోసమే హిందూజాతి బ్రతకాలి. ఇది పరమేశ్వరుని అభీష్టం. పరమేశ్వరుడు భారతదేశానికి అప్పగించిన ఈ పనిని పూర్తిచేసే సామర్థ్యం సమాజంలో నిర్మాణం కావడం అనేదే హిందూ సంఘటనకు లక్ష్యం అని గురూజీ చెప్పేవారు.

## *ఈ యుగధర్మం బలోపాసన:*

ముందు మనం శక్తివంతులం కావాలి. సిద్ధాంతం వెనుక శక్తి ఉండాలి. అప్పుడు మాత్రమే ఆ సిద్ధాంతాన్ని ప్రపంచం అంగీకరిస్తుంది-అన్న మాట ప్రస్తుత సర్‌సంఘచాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ ప్రసంగాలలో వస్తూ

ఉంటుంది. ఆ పని జరుగకపోతే, ఆ సిద్ధాంత గ్రంథాలు చరిత్ర పరిశోధకులకు విషయాలుగా బీరువాలను అలంకరిస్తూ ఉంటాయి. ఆనాడు డాక్టర్‌జీ ఇలా అన్నారు 'మన ధర్మ సంస్కృతులు ఎంత గొప్పవి అయినా - వాటిని కాపాడుకొనే బలం మనకు లేకపోతే ప్రపంచంలో ఏ ఒక్కరూ వాటిని గౌరవించరు. బలహీనముగా ఉన్నందువలననే మన ధర్మం, మన సమాజం దీనస్థితికి దిగజారి పోయాయి'. ఈ శక్తిసాధనను సంఘం ఆరు దశాబ్దాలుగా నిరంతరంగా సాగిస్తోంది.

పరిస్థితులలో వచ్చిన మార్పు, ఇప్పుడు మరింత వేగంగా వస్తున్న మార్పు పరిశీలించ దగినది. సంఘ స్థాపన సమయంలో సంఘ సిద్ధాంతాన్ని, కార్యపద్ధతిని, ఆమోదించే వాళ్ళు బహుకొద్దిమంది మాత్రమే ఉండేవాళ్ళు. అసలు హిందువులను ఏకం చేయగలమనే నమ్మకమే ప్రజలలో ఉండేది కాదు. గత 63 సంవత్సరాలలో ఈ వాతావరణం పూర్తిగా మారిపోయింది. హిందూ సిద్ధాంతాలను బలపరిచే వాళ్ళు నేడు దేశమంతటా కనిపిస్తున్నారు. రాజకీయ స్వార్థం కారణంగా సంఘాన్ని మతతత్వ సంస్థగా చిత్రీకరించే వారు సైతం ఇతర సమయాలలో తమ మనసులోని మాటను చెప్పేటప్పుడు మరోవిధంగా మాట్లాడుతున్నారు. హిందూ ఓటర్లలో మేలుకొలుపు పెరిగే కొలదీ వారు హిందువులుగా నిర్ణయం తీసుకోవటం పెరిగేకొలదీ - సంఘం పట్ల, హిందూ సమాజంపట్ల రాజకీయ నాయకుల వైఖరిలో మార్పు వచ్చి తీరుతుంది. ఆ నాయకులు వీరి దయకోసం అర్రులు చాచుతారు.

## *పొంగిపొరలుతున్న హిందూత్వపు వెల్లువ:*

హిందూ జాగరణ వెల్లువ ఇబ్బందులను, ఆటంకాలను పటాపంచలు చేస్తూ పొంగిపొర్లుతోంది. దేశాన్ని గురించి ఆలోచించే యువకవర్గం భారీ ఎత్తున హిందూ రాష్ట్ర సిద్ధాంతంవైపు మొగ్గుతోంది. ఇతరులంతా తాము నిర్వహించవలసిన పాత్ర గురించి పునరాలోచన చేసుకోవలసిన దశ వచ్చింది. 1925లో డాక్టర్‌జీ ఒంటరిగా నిలబడి "ఇది హిందూ రాష్ట్రం, దీన్ని సంఘటితపరుస్తాను, పరమవైభవ శిఖరాలకు చేర్చుతాను" - అని నిర్ణయించుకొని కార్యరంగంలో ప్రవేశించారు. 15 సంవత్సరాలపాటు ఆయన శరీరంలోని కణకణమూ ఆహుతి చేశారు. అందువల్లనే నేడు పరిస్థితులలో మార్పు కనపడుతోంది. ఆశ చిగురిస్తోంది. డాక్టర్‌జీ సంఘాన్ని నిర్మించటం ఆధునిక భారత దేశానికి పట్టిన అదృష్టం, నోచుకున్న నోముల పంట.

అలాంటి సంఘనిర్మాత శతజయంతిని మనం జరుపుకొంటున్నాం. సంఘం ఒక సంస్థగా తన జన్మదాత శతజయంతి ఉత్సవాలను జరుపుకోవాలన్నది ఈ

ఉత్సవాల ఉద్దేశ్యం కాదు. ఏ హిందూ సమాజంయొక్క ప్రగతికోసం డాక్టర్‌జీ మనస్సు తపించిందో, ఆ హిందూ సమాజమంతా కృతజ్ఞతా భావంతో ఆయనను స్మరించి ధన్యం కావాలన్నదే ఈ కార్యక్రమం వెనుక ఉన్న ఉద్దేశ్యం. మహాపురుషుల విగ్రహాలను పూజా మందిరంలో ప్రతిష్ఠించి, వాటికి ధూప, దీప, నైవేద్యాలతో పూజ చేయటం డాక్టర్‌జీకి నచ్చని పని. ఈ 'నమస్కారవాదం' ఆయనకు ఎంతమాత్రమూ రుచించేది కాదు. నాలుగు భుజాలతో లోకమాన్య తిలక్ విగ్రహాన్ని తయారుచేసి దానికి పూజలు చేసేవారిని ఆయన నిశితంగా విమర్శించేవారు. రాముణ్ణి, కృష్ణుణ్ణి భజన చేస్తూ కూర్చోవడం, పుణ్యం వస్తుందని రామాయణం చదవడం ఆయనకు ఇష్టం ఉండేది కాదు. ఈ మహాపురుషుల అందరిలో ఉన్న అమూల్యమైన గుణసంపదను చూడాలి. వారి ఉపదేశాలను వినాలి. వాటికనుగుణంగా భక్తులు తమ జీవితాలను మలచుకోవాలి - ఇదీ ఆయన భావన.

## *నీ సాధన సఫలం చేయటమే మా జీవన వ్రతం :*

సుమారు 50 సంవత్సరాల క్రితం డాక్టర్‌జీ చేసిన ఈ దిగువ ప్రబోధం స్వయంసేవకులయ్యే అదృష్టం పొందిన వారందరి చెవులలో మారుమ్రోగుతూనే ఉంటుంది. "ప్రజలను సంఘటిత పరచటం ద్వారా దేశానికి అద్భుతమైన శక్తి లభిస్తుందని మనం ఋజువు చేయాలి. ఈ పనికోసం మనలోని ప్రతి ఒక్కరి హృదయంలోనూ తపన కలగాలి. మరోపని మనకు రుచించకూడదు. సమాజసేవ అనే మహావ్రతాన్ని చేపట్టిన స్వయంసేవకునికి సుఖం ఎక్కడ? విరామం ఎక్కడ? అతనికి ఈ కార్యమే సర్వస్వము. శక్తి అంతటిని ఒడ్డి అతను పనిలో నిమగ్నం కావాలి. మన కళ్ళతోనే, మన కార్య సాఫల్యాన్ని చూడాలనే తీవ్రమైన వాంఛ మనలో ఉండాలి. ప్రతి స్వయంసేవకూ తన ఈ కర్తవ్యాన్ని పాలిస్తాడని నాకు పూర్తి నమ్మకం ఉంది".

"........................భారతదేశంయొక్క అదృష్టదేవతను మీరే ప్రసన్నం చేయగలరు. మరెవ్వరికీ సాధ్యం కాదు. సర్వస్వాన్ని సమర్పణ చేస్తూ, నిరంతరం కార్య శూరతను ప్రదర్శించగలవారు మీరుతప్ప మరెవరు? ఇది మీరు చేయవలసిందే! మీరు మాత్రమే చేయవలసింది"!! అన్నారు డాక్టర్‌జీ.

డాక్టర్‌జీ కార్యశూరులు. జాతికి పూర్తిగా అంకితమైన జీవితం వారిది. వ్యక్తి పూజకు కాక తత్వపూజకు ప్రాధాన్యం ఇచ్చారు. అందువల్లనే - వ్యక్తి కాలగర్భంలో కలిసి పోయినా సంఘం పని ఆగలేదు. సంఘనాయకులకు జయజయధ్వానాలు పలికే సంప్రదాయం సంఘంలో ఏర్పడకుండా ఆయన మొదటినుంచీ జాగ్రత్తవడ్డారు.

అలాంటి స్థితిలో ఆయనకు జయజయధ్వానాలు పలికి ఆయన విగ్రహాలను పూజామందిరాలలో ప్రతిష్ఠించి ఆయన శతజయంతిని ఎలా జరుపగలం? డాక్టర్‌జీని నిజంగా స్మరించాలంటే - ఆయన ఆలోచనల ఔన్నత్యము, ఆయన మనస్సులోని తపన, సంఘటనను నిర్మించడంలో ఆయన ప్రజ్ఞ, విరామం లేకుండా పరిశ్రమిం ఆయన జీవనసరళి - ఈ గుణాలను, ఆదర్శాలను, యావత్ సమాజమూ తన క ముందుంచుకొని పనిచేయాలి. ఉదాసీనతను వదులుకోవాలి. ఆయన కలలుకన్న అజేయ హిందూ రాష్ట్రాన్ని నిర్మించటానికై రాత్రింబవళ్ళు శ్రమించాలి. నేటి అనుకూల పరిస్థితులలో హిందూ జాగరణ కార్యాన్ని నలువైపులకూ యోజనాబద్ధంగ వ్యాపింప జేయాలి. జాతి శ్రేయస్సుకు, మానవ కల్యాణానికీ హిందూ శక్తి అవసరం కనుక అన్ని ఒత్తిడులను తట్టుకొని బహిరంగంగా, తను మన ధనాలతో ఈ పనికి అంకితం కావడం ప్రతి హిందువుకూ కర్తవ్యం అవుతుంది. హిందూ సంఘటన అవసరమనీ, అనివార్యమనీ, ఆచరణ సాధ్యమనీ భావించే వ్యక్తులు లక్షలసంఖ్యలో ఉండటం మన అదృష్టం. ఇది కోట్లసంఖ్యలో పరిణితి చెందాలి. విశాలమైన రాచబాట మన ఎదుట ఉంది. అందరం కలిసి విజృంభిస్తే అనుకొన్నదానికన్నా ముందుగానే పరిస్థితిని మార్చగలం. మార్చుదాం.

భారత్ మాతాకీ జయ్!